Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 2 • 13-1-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-






### ఆ యువతి చావులో

# అన్నీ అనుమానాలే!

- ఆత్మహత్య అయితే పోలీసుకు ఎందుకు చెప్పలేదు?
- పెళ్లయిన రెండు నెలల్లో ఆత్మహత్య దేనికి?
- సహజ మరణమైతే దాపరికమెందుకు?
- వూరు కాని వూరులో శవదహనం ఏమిటి?
- డెత్ సర్టిఫికేట్ ఎవరిచ్చారు?
- ఉత్తరక్రియలు నెల్లూరులో ఎందుకు చేశారు?
- కాంగ్రెస్ ప్రముఖుడి ప్రమేయం ఎంతవరకు?

గూడూరు తాలూకా కొమ్మనేటూరులో ఒక యువతి అనుమానపు చావు గురించి గతవారం వెలిబుచ్చిన అనుమానం నూటికి నూరుపాళ్లు నిజమని తెలింది. అయితే ఆ వూరి పేరు కొమ్మనేటూరు కాదు, వెడిచర్ల. రెండూ పక్క పక్క వూళ్లు. ఆ యువతి కురుగొండకు చెందిన కట్టా శేషారెడ్డి కుమార్తె అని ధృవపడింది.

శేషారెడ్డి, కాంగ్రెస్‌లో పనబాక కృష్ణయ్య అనుచరుడు. గత కొన్ని సంవత్సరాలుగా వారి కుటుంబం మద్రాసులోని వెలాచెరి ప్రాంతంలో నివాసం వుంటుందట. అనుమానపు చావుకు గురైన ఆయన కుమార్తె పూజారెడ్డి ఇంజనీరింగ్ పూర్తి చేసి, ఎంబిహెచ్ఎం అనే మేనేజ్‌మెంట్ కోర్సు చదువుతున్నది. ఆమె చదువు హైదరాబాదులో. గత అక్టోబర్ 16తేది గూడూరులో ఆమెకు వివాహమైంది. వరుడు, ఏలూరుకు చెందిన పవన్‌కుమార్‌రెడ్డి. ఆ యువకుడు ఎండి చదివిన డాక్టర్. డిసెంబర్ 15తేది అర్ధరాత్రి పూజారెడ్డి మృతదేహాన్ని గూడూరు తాలూకా వెడిచెర్లకు, ఒక ప్రైవేటు అంబులెన్స్‌లో తెచ్చారు. ఆ అంబులెన్స్‌లో ఇద్దరు తమిళులు వచ్చారట. వారికి, ఆమెకు బంధుత్వం ఏమిటో తెలియదు. శవం మెడకు తెల్లటి గుడ్డ చుట్టి వున్నారట. గ్రామస్తులు కొందరు దాన్ని గమనించి, ఏమిటని ప్రశ్నిస్తే సమాధానం చెప్పడానికి ఆ యువతి సంబంధీకులు సుముఖత చూపలేదట. అయితే, పెళ్లయిన మహిళను స్మశానానికి పంపే ముందు మెడలో తాళిబొట్టు తీసి వేయడం సాంప్రదాయమని గ్రామస్తులు గట్టిగా వాదించడంతో, విధిలేక ఆ గుడ్డ పక్కకు తప్పించి, తాళిబొట్టు తీశారట. ఆ సమయంలో ఆ యువతి మెడ మీద పెద్ద గాయం కన్పించిందట. దానిలో దూదికూరి వున్నారట. దానితో గ్రామస్తులకు అనుమానం వచ్చి ఏమి జరిగిందని నిలదీసేసరికి, మా బిడ్డను మేము చంపుకొంటామా అని నిష్ఠూరపడ్డారట సంబంధీకులు. చావుకు కారణమేమిటన్న ప్రశ్నకు సంతృప్తికర సమాధానం లేకుండానే దహనం చేసివేశారు.

దీనిపై లోతుగా పరిశీలించి చూస్తే అన్నీ అనుమానాలే తలెత్తుతున్నాయి. ఆ యువతి చావు సహజ మరణమా, ఆత్మహత్యా లేక హత్యా అన్నది మిస్టరీగా మారింది. బాత్‌రూంలో జారి పడి, చనిపోయిందని కొందరికి, ఉరి పోసుకొని ఆత్మహత్య చేసుకొందని మరికొందరికి చెప్తున్నారు బంధువులు. ఇవి రెండూ నిజమైన కారణాలు కావని సులభంగా అర్థమైపోతున్నది.

ఆ యువతి వయస్సు పాతికేళ్లు కూడా లేదు.

కొరవ 14వ పేజీలో

## విజయసాయి అరెస్ట్‌కు నెల్లూరీయుడే కారణమా?



జగన్ అక్రమాస్తుల కేసులో విజయసాయిరెడ్డి అరెస్ట్ వెనుక ఒక నెల్లూరీయుడి ప్రమేయం వుందని తెలుస్తున్నది. మద్రాసుకు చెందిన ప్లాజా ప్రాపర్టీస్ అనే భవన నిర్మాణ సంస్థ యజమాని తిక్కవరపు శ్యాంప్రసాద్ రెడ్డి సిబిఐకి విజయసాయి గురించిన కీలక సమాచారం అందించాడని ధృవపడని వార్త. శ్యాంప్రసాద్‌రెడ్డి, విజయసాయిరెడ్డి పూర్వాశ్రమంలో మంచి స్నేహితులట. ఇద్దరి మధ్య వ్యాపార లావాదేవీలు కూడా వున్నాయట. జగన్ అక్రమ ఆస్తుల కేసు విచారణ చేపట్టగానే సిబిఐ అధికారులు మద్రాసులో శ్యాంప్రసాద్‌రెడ్డి ఇంటిని కూడా సోదా చేశారు. అప్పట్లో ఆయన ఎవరో, జగన్ అక్రమాస్తులకు ఆయనకు సంబంధం ఏమిటో బయట ప్రపంచానికి తెలియదు. కానీ విజయసాయిరెడ్డి అరెస్ట్‌తో శ్యాంప్రసాద్‌రెడ్డి పేరు వెలుగులోకి వచ్చింది. తాను జగన్ కంపెనీలలో పెట్టుబడులు పెట్టడానికి విజయసాయిరెడ్డి ఒత్తిడే కారణమని సిబిఐకి వివరించినట్లు తెలుస్తున్నది.

## కార్టూన్ స్కేప్



# పాకిస్తాన్ కల్లోలం

మన పొరుగుదేశం పాకిస్తాన్ మరొకసారి రాజకీయ సంక్షోభంలో కూరుక పోతున్నది. సైనిక పాలనా సంక్షోభానికి దగ్గర అవుతున్నది. పాక్ సర్వసైన్యాధిపతి జనరల్ కయానీ అష్ఫఖ్ పర్వేజ్ కయానీ పౌర ప్రభుత్వానికి తీవ్రస్థాయిలో హెచ్చరిక చేశాడు. నీ పద్ధతి మార్చుకోకపోతే దేశంలో ప్రమాదకర పరిణామాలు సంభవిస్తాయని ప్రధానమంత్రి యూసఫ్ రజా గిలానీని బెదరించాడు.

మెమో గేట్‌గా ప్రసిద్ధి చెందిన వివాదం ఈ పరిణామాలకు మూలం. గత ఏడాది మే 2తేదీ అబోటాబాద్ నగరంలోని ఒసామా బిన్ లాడెన్ శిబిరంపై అమెరికన్ సైన్యం దాడి దీనికి ప్రారంభం. తమ భూభాగంపై అమెరికన్ సైన్యం దాడి జరపడం పాకిస్తాన్ పౌరుల ఆత్మగౌరవాన్ని దెబ్బ తీసింది. ఈ తప్పు ఎవరిదనే విషయంలో పౌర ప్రభుత్వం, పాక్ సైన్యం కీచులాటకు దిగాయి. ఆ నేపథ్యంలో, అమెరికాలోని పాకిస్తాన్ రాయబారి హక్కాని, అమెరికన్ సైనిక దళాధిపతి అడ్మిరల్ మైక్ ముల్లెన్‌కు ఒక అత్యవసర మెమోరాండం పంపాడు. పాకిస్తాన్ సైన్యం, ప్రభుత్వాన్ని కూలదోసే కుట్ర జరిపితే కాపాడాలని అందులో విజ్ఞప్తి చేశాడు. ఈ విజ్ఞప్తి వెనుక పాక్ అధ్యక్షుడు ఆసిఫ్ అలీ జర్దారీ వున్నారని వదంతి. జర్దారీ అంటే, స్వర్గీయ బెనజీర్ భుట్టో భర్త. అయితే, తమ స్వంత సైన్యం మీద అంత తీవ్రమైన సందేహం వ్యక్తం చేస్తూ పరాయి దేశపు సైన్యాన్ని అర్థించడం పాక్‌లో రాజకీయ కల్లోలాన్ని సృష్టించింది. ఆ దేశపు సుప్రీంకోర్టు ఈ విషయంలో విచారణ ప్రారంభించింది. సర్వసైన్యాధిపతి జనరల్ కయానీ, సుప్రీం కోర్టుకు తన వివరణ ఇచ్చాడు. ప్రభుత్వ అనుమతి లేకుండా సైనికాధిపతి నేరుగా సుప్రీంకోర్టుకు వివరణ ఇవ్వడం రాజ్యాంగ ఉల్లంఘన అని నిందించాడు ప్రధానమంత్రి జిలాని. ఆ వెంటనే కయానీకి సన్నిహితుడైన దేశ రక్షణ శాఖ కార్యదర్శి లెఫ్టినెంట్ కల్నల్ నయీం ఖలీద్ లోడిని పదవి నుంచి తొలగించాడు. ఈ రెండు చర్యలూ కయానీకి కోపం తెప్పించాయి. ఏ మాత్రం తడుముకోకుండా నేరుగా ప్రధానమంత్రినే తప్పు పడుతూ హెచ్చరిక చేశాడు కయానీ.

ఈ పరిణామాలు అటు తిరిగి, ఇటు తిరిగి పాకిస్తాన్‌లో సైనిక తిరుగుబాటుకు దారి తీస్తాయన్న అనుమానాలు బలంగా విన్పిస్తున్నాయి. అటు ప్రధాని, ఇటు కయానీ కూడా ఇప్పటికే అమెరికన్ సహాయం అర్థించారని వినికిడి. ఈ అవకాశాన్ని అమెరికా తనకు అనుకూలంగా మలచుకొంటుందనడంలో అనుమానం ఏదీ లేదు. ఇటువంటి అస్థిరత కోసమే ఎదురు చూస్తున్నది అమెరికన్ ప్రభుత్వం.

అయితే అణుబాంబు సామర్థ్యం కల్గిన పాకిస్తాన్‌లో ఇటువంటి రాజకీయ అనిశ్చిత పరిస్థితులు ఆ ఒక్క దేశానికే కాక, మొత్తం ప్రపంచానికే ప్రమాదకరంగా పరిణమిస్తాయి. దాని ఫలితాలు, ప్రభావాలు ఎట్లా వుండబోతాయో కూడా వూహించడం కష్టం. ఇప్పటికే పాకిస్తాన్‌లో భూస్వాములు, గిరిజన తండా నేతలు, ఆఫ్ఘన్ తాలిబన్లు అరాచకం సృష్టిస్తున్నారు. సగం దేశంలో ప్రభుత్వ నియంత్రణ అన్నది లేదు. ఎక్కడికక్కడ బలం కల్గిన వారు పెత్తనం చేస్తున్నారు. మరొక ప్రక్క ఆర్థిక కష్టాలు, అభివృద్ధి లేమి, పాలనలో అవినీతి వంటి కారణాల వల్ల ప్రజలు దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నారు. ఆకలి చావులు సర్వసాధారణంగా జరిగిపోతున్నాయి. ప్రజలలో ఇంత అశాంతి వున్నప్పుడు రాజకీయ సంక్షోభం తలెత్తితే ఎంత ప్రమాదమో వివరించి చెప్పనవసరం లేదు.

పాకిస్తాన్‌కు సైనిక తిరుగుబాట్లు అలవాటైన విషయం. 1949లోనే మొదటి ప్రధానమంత్రి లియాఖత్ ఆలీ ఖాన్‌పై కుట్ర జరిగింది. దాన్ని ఎట్లానో నివారించుకొన్నా, 1958లో జనరల్ అయూబ్ ఖాన్ ప్రభుత్వాన్ని కూలద్రోశాడు. 1977లో జనరల్ జియా ఉల్ హక్, అప్పటి ప్రధాని భుట్టోను దించి, తాను గద్దె ఎక్కాడు. మూడేళ్ల లోపల జియా ఉల్ హక్ మీద తాజ్‌ముల్ హసన్ మాలిక్ తిరుగుబాటు ప్రకటించాడు కానీ, అది విఫలమైంది. 1995లో బెనజీర్ భుట్టో మీద జహిరుల్ అబ్బాసి అనే సైనికాధికారి తిరుగుబాటు ప్రయత్నం చేశాడు. కానీ అది కూడా విఫలమైంది. అయితే 1999లో జనరల్ ముషారఫ్, ఆనాటి ప్రధాని నవాజ్ షరీఫ్‌ను గద్దె దించి, తానెక్కాడు. ఇంత సుదీర్ఘకాలం సైనికాధిపతుల తిరుగుబాట్లు, సైనిక పాలన వల్లనే పాకిస్తాన్ అంత పేద దేశంగా మిగిలిపోయింది. ఇప్పుడు మరొకసారి అదే పరిస్థితి తలెత్తడం విచారకరం. దీన్ని నివారించుకొనే సామర్థ్యం పాక్ నేతలకు లేదు. అమెరికన్ల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వుంది ఆ దేశ భవితవ్యం. ఈ పరిణామాల పట్ల తగిన జాగ్రత్తలు తీసుకోవడం భారత ప్రభుత్వ కర్తవ్యం. పాకిస్తాన్‌లో జరిగే ప్రతి పరిణామమూ మన మీద దుష్ఫలితాలు చూపడాన్ని అనుభవించాము కాబట్టి, ఎంత జాగ్రత్తగా వుంటే అంత మంచిది.

జమీన్‌రైతు

## జనవాణి

### ప్రశ్నాపత్రాల్లో తప్పులు!

ఎపిపిఎస్‌సి నిర్వహించే వుద్యోగ రాత పరీక్షల్లో ఇచ్చే ప్రశ్నాపత్రాల్లో దొర్లే అనువాద దోషాల మూలంగా నిరుద్యోగుల రాతలు తలక్రిందులవుతున్నాయి. ప్రశ్నాపత్రాల రూపకల్పనలో కనీస జాగ్రత్తలు పాటించని మూలంగా వుద్యోగం కోసం ఏళ్లతరబడి సన్నద్ధమైన వారి ఆశలపై నీళ్లు చల్లినట్లవుతోంది. వ్రాత పరీక్ష ఏదైనా అంతిమంగా నష్టపోతున్నది తెలుగు మాధ్యమ అభ్యర్థులే. పరీక్షల్లో తప్పిదాలు, అనువాద దోషాలు తలెత్తాయంటూ అభ్యర్థులు గోలపెట్టినా పట్టించుకొనేవారు లేరు. మొన్న ప్రకటించిన గ్రూప్ వన్ ఫలితాల్లో 75శాతం మంది ఇంగ్లీషు మీడియం అభ్యర్థులే ఇంటర్వ్యూలకు ఎంపికయ్యారు. ఎపిపిఎస్‌సి తన చరిత్రలో ఎన్నడూ లేనన్ని నోటిఫికేషన్లు ఈ సీజన్‌లో విడుదల చేస్తోంది. ఇకనైనా ప్రశ్నపత్రాలు రూపొందించే విషయంలో జాగ్రత్త పాటించమనవి.

కాపులూరు సతీష్ — కావలి

### సమంజసంగా లేదు

నగదు బదలీ మంచి పద్ధతి కాదు. చట్టబద్ధమూ కాదు. అంతేకాక అన్యాయం కూడా. దేశప్రజల కష్టార్జితమైన పన్నుల ధనాన్ని ఉచితంగా బీదవారికి నెలనెలా పంపిణీ చేయడం ఘోరం. కళ్లు, కాళ్లు, చేతులు సక్రమంగా పని చేస్తున్న వారికి ఊరికే ఇంట్లో కూర్చోబెట్టి నెలనెలా ఉచితంగా డబ్బు పంపిణీ చేయడం మంచి పద్ధతా? ఈ విషయాన్ని రాజకీయ నాయకులు తెలుసుకోవాలి. ఈ పద్ధతి ప్రపంచంలో ఎక్కడా లేదు. వృద్ధులు, వికలాంగులు, అనాథలకు ధన సహాయం చేయటం వరకూ పరవా లేదు.

ఎస్.కిషోర్ — గూడూరు

### మనీ స్కీం బాధితులకు న్యాయం చేయండి!

జిల్లాలో ఎన్నో స్వచ్ఛంద సంస్థలు మనీ సర్క్యులేషన్ స్కీం పేరిట పేద ప్రజల నుంచి 600 కోట్ల రూపాయల వరకు వసూలు చేసుకొన్నాయి. వీటిని తిరిగి చెల్లించను కుంటి సాకులు చెబుతున్నాయి. ఈ వ్యవహారంలో సిఐడి సమర్థవంతంగానే విచారణ చేస్తున్నా ఇది చాలా రోజులు సాగేటట్లుంది. జిల్లా కలెక్టర్ ఈ వ్యవహారంలో జోక్యం చేసుకొని ఇప్పటివరకు స్వాధీనం చేసుకొన్న డబ్బు, భవిష్యత్తులో స్వాధీనం చేసుకొనే డబ్బు తక్షణం ప్రజలకు పంపిణీకి చర్యలు తీసుకోమనవి.

మందా బాజ్జీ — నెల్లూరు

### అర్హులు వీరు!

భారత ప్రభుత్వం దేశంలో అత్యంత గౌరవనీయమైన వారికి 'భారతరత్న' పురస్కారం ప్రదానం చేస్తుంది. దీన్ని 1954 నుంచి రాజకీయ, విజ్ఞాన, కళలు,

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

16-1-1941
పేజీలు : 8 వెల: అణా

### ఛైర్మన్ రాజీనామా

ఛైర్మన్ ఏ.సి.సుబ్బారెడ్డి గారి అభిప్రాయానికి వ్యతిరేకంగా తన పార్టీ వారు ఓటుచేసినారనే ప్రణయ కలహంతో తన రాజీనామా లేఖను ఆంధ్ర రాష్ట్రాధ్యక్షుడు ప్రకాశం పంతులు గారి పాదపద్మముల సన్నిధికి పంపించినట్లు రూఢీకాని, నిజమైన అనధికార వార్త. తన పక్షం వారు వ్యతిరేకంగా ఓటు చేసింది తీర్మానం మీద కాదు. లాటరీ వెయ్యాలనా, అక్కరలేదా? అన్న అభిప్రాయం మీద. కావున అది ఏమంత ముఖ్యం కాదు. కానీ కౌన్సిల్ మీటింగుకు ముందు పార్టీ మీటింగు 'జరిగి వుండి' పార్టీ తీర్మానానికి వ్యతిరేకంగా ఓటుచేసి ఉంటే అప్పుడు ఆ సమస్య వస్తుంది. పార్టీ మీటింగు ముందుగా లేదనే మేం అనుకుంటాము. కావున రాజీనామా అవసరమా?

### కోవూరులో గొడవ

గత 9వ తేదీ నెల్లూరు సమీపంలో కోవూరులో కూలీలు సుమారు 100 మంది ధర తగ్గించమని కోరుటకు రాగా వర్తకులు భయపడి కొట్లు మూశారు. సర్కిల్ మున్నగు పోలీసు వర్గమొచ్చి సర్దుబాటు చేసింది.

### రాపూరు బస్ ప్రమాదం

15వ తేదీ సాయంత్రం రాపూరు నుండి నెల్లూరుకు వచ్చే బస్ సైదాపురం వద్ద ఒక చెట్టును ముద్దు పెట్టుకొంది. డ్రైవర్ కొంచెం అసమర్థుడు కాబట్టి ప్రమాదం జరిగిందని, అసమర్థుడైన పెద్ద మనిషి కాబట్టి స్పీడుగా పోనివ్వనందున ప్రయాణీకులకెవ్వరికీ దెబ్బలు తగలలేదని, కండక్టర్‌కు మాత్రం స్వల్పం అంటే చిన్న దెబ్బ తగిలిందని తెలుస్తున్నది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

12-1-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఇది సమయంగాదు

11వ తేదీ రాత్రి నెల్లూరు ఎన్నికల సభలో నాయకత్వ విషయమై ముఖ్యమంత్రి సంజీవయ్య ప్రకటనను ప్రస్తావించి ఏ.సి.సుబ్బారెడ్డి ఈ వివాదానికి యిది సమయంగాదని, కాంగ్రెస్ వాదులందరూ కలిసి కట్టుగా వ్యవహరించడమే నేటి కర్తవ్యమని వెలిబుచ్చారు. "మా పెద్దలది కాస్త మతిభ్రమణ మనస్తత్వం. అందువల్ల అట్లా అంటుంటారేగానీ ఆ ప్రకటనలకు మనం అంత విలువివ్వవలసిన అవసరం లేదు" అని గూడా అన్నారు సుబ్బారెడ్డి. "ప్రజాస్వామ్యంలో ప్రజలచే ఎన్నుకోబడే ప్రతినిధికి నాయకత్వాన్ని అభిలషించే హక్కున్నది. అటువంటప్పుడు వాగ్వివాదమెందుకు" అని ప్రశ్నించారు ఏ.సి.

### విరమించారనడం నిరాధారం

డాక్టర్ గోపాలరెడ్డి పోటీ విరమించుకోవచ్చునని ప్రచారమవుతున్న వార్తలు కేవలం నిరాధారం. ఇది ఈ విధంగా కాంగ్రెస్ వాదులను నిరుత్సాహపరచుటకు ప్రతిపక్షాలు యెత్తిన యెత్తేగానీ, యదార్థం యించుకైనా లేదు. పది రోజుల క్రితమే నెల్లూరు తిప్పరాజు వారి సత్రం గోడ ఈ వార్తను వ్రాసింది. ఈ వ్రాతగానికి ఆ వార్తను యెవరిచ్చారో, దానిని ధృవపరచుకోకుండా ఎట్లా వ్రాశాడో ఆశ్చర్యము. 10వ తేదీ 'ఆంధ్ర పత్రిక'లో యింటువంటి వార్తే మరొకటి ప్రకటితమైంది. అది గుంటూరు నుండి పంపబడిన వార్త. ఇక వాగ్రూపంగా జరిగే దుష్ప్రచారానికి అంతం లేదు. ఇలాంటి నిరాధార ప్రచారం వల్ల ఎలాంటి లాభమూ చేకూరదు.

# నెల్లూరు ముచ్చట్లు

## చంద్రబాబు రాక

ప్రతిపక్ష నేత నారా చంద్రబాబు నాయుడు 20వ తేది జిల్లాకు రానున్నారు. రాష్ట్రవ్యాప్తంగా ఆయన చేపడుతున్న రైతు యాత్రలో భాగంగా జిల్లాలోని కొన్ని మండలాల్లో పర్యటిస్తారు. ఈ వార్త వ్రాసేసరికి ఆ మండలాల వివరాలు తెలియరాలేదు.

## 500 కోట్ల రూపాయల మద్యం తాగేస్తున్నారు!

ఓ అబ్కారీ సంవత్సరం అంటే (రెండేళ్ల వ్యవధి)లో నెల్లూరీయులు 500 కోట్ల రూపాయల మద్యం తాగేస్తున్నారు. వినేవారికి కాస్త విచిత్రమనిపించినా ఇది మాత్రం అక్షర సత్యం. 2010 జూలై నెలలో జిల్లాలోని బ్రాందీషాపులు, బార్లకు వేలంపాట నిర్వహించగా 370 కోట్ల రూపాయలకు పాడుకొన్నారు. జిల్లాలో లైసెన్సు మద్యం షాపులు 348 ఉండగా, బార్లు 48 ఉన్నాయి. వీటిలో ఎమ్మార్పీ ధరకన్నా ఎక్కువ ధరకు అంటే 130 కోట్ల రూపాయల అధిక లాభాలే లక్ష్యంగా సులభంగా వ్యాపారం చేస్తున్నారు. ఎమ్మార్పీ ధరలకన్నా అధికంగా దోచుకొంటున్న డబ్బును రాజకీయ పార్టీల నేతలు, ఎక్సైజ్, సివిల్ పోలీసులు, మీడియా అందరికీ తిలాపాపం తలాపిడికెడు పంచుతున్నారు. ప్రభుత్వం లెక్క ప్రకారమైతే జిల్లాలో రోజుకు 50 లక్షలకు పైబడి, బ్రాందీషాపుల వాళ్ల లెక్క ప్రకారమైతే రోజుకు కోటి రూపాయల పై చిలుకు మద్యం అమ్ముడుపోతుంది. ఒకప్పుడు మద్యపాన వ్యతిరేక ఉద్యమం పురుడు పోసుకొన్న జిల్లాలో ఇప్పుడు గ్రామగ్రామాన బెల్ట్‌షాపుల పుణ్యమా అంటూ మద్యం ఏరులై పారుతున్నా పట్టించుకునే వారు లేరు.

## ప్రజావిజ్ఞప్తుల దినాన్ని కాస్త మార్చిన ఎస్పీ!

ఎస్పీ బి.వి.రమణకుమార్ ప్రతి సోమవారం జిల్లా పోలీసు కార్యాలయంలో నిర్వహిస్తున్న ప్రజావిజ్ఞప్తుల దినానికి అనూహ్య స్పందన వస్తుంది. పోలీసు వ్యవహారశైలికి భిన్నంగా ఎస్పీ దీన్ని నిర్వహిస్తున్నారు. ఇప్పటివరకు ఎస్పీగారే ఫిర్యాదులు స్వీకరించి, ఆయా డివిజన్లలోని డిఎస్పీలకు పరిష్కరించమని నివేదించేవారు. నెల్లూరు, కావలి, ఆత్మకూరు డిఎస్పీలుగా కొత్త అధికారులు రావడంతో ఈ ప్రక్రియలో వారిని భాగం చేయను పోలీసాఫీసులో 9వ తేది డివిజన్ల వారీగా విడిగా ప్రజావిజ్ఞప్తుల దినాన్ని నిర్వహించారు. దీనివల్ల కొత్త డిఎస్పీలకు ప్రజల సమస్యలు అర్థమయ్యేటట్లు చేశారు. ఎస్‌ఐలను సైతం ఈ వ్యవహారంలో భాగస్తులను చేస్తే ఎస్పీగారికి ప్రజావిజ్ఞప్తులు స్వీకరించే విషయంలో కాస్త వెసలుబాటు లభిస్తుంది.

## రికార్డింగ్ డ్యాన్సుల ఫెస్టివల్!

ఈ నెల 7, 8 తేదీల్లో సూళ్లూరుపేటలో పెద్దఎత్తున ఫ్లెమింగో ఫెస్టివల్‌ను ప్రజాప్రతినిధుల సహకారంతో జిల్లా అధికార యంత్రాంగం నిర్వహించింది. నేలపట్టులో పక్షులను తిలకించమన్న ప్రచారం చేయక సినీ యాక్టర్ల రికార్డింగ్ డ్యాన్సుల విషయమై విపరీతంగా ప్రచారం చేయడంతో యువజనులు వెల్లువెత్తారు. 8వ తేది రాత్రి సూళ్లూరుపేట కాలేజి గ్రౌండ్ జనంతో కిటకిటలాడిపోయింది. ఛార్మి డ్యాన్స్‌తో రెచ్చిపోయిన ప్రేక్షకులు కాజల్ ససేమిరా అనడంతో హద్దులు దాటేశారు. కలెక్టర్, జాయింట్ కలెక్టర్, మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీ, పోలీసులను ఎవరినీ లెక్కచేయక భీభత్సకాండకు దిగడంతో 700 కుర్చీలు, బారికేడ్లు తుక్కుతుక్కయ్యాయి. కలెక్టర్ కన్నెర్ర చేయడంతో రికార్డు డ్యాన్సులు ఆగాయి. అప్పటికే జరిగిపోవాల్సిన నష్టం జరిగిపోయింది. పక్షుల పండుగను పక్షుల పండుగగానే నిర్వహిస్తే బాగుంటుందని పెద్దలంతా గ్రహిస్తే మంచిది.

## ఎసిబికి కొత్త డిఎస్పీ!

నెల్లూరు ఎసిబి డిఎస్పీగా జె.భాస్కర్‌రావు నియమితులయ్యారు. బ్రాందీషాపులు, బార్లపై దాడుల అనంతరం అప్పటి డిఎస్పీ శరత్‌బాబు అకస్మాత్తుగా బదలీ అయ్యారు. భాస్కర్‌రావు నెల్లూరుకు పాతకాపే. అంతకు ముందు ఆయనకు ఎసిబి సిఐగా పనిచేసిన అనుభవముంది.

## చిటపటలాడిన మంత్రి శైలజానాథ్!

రాష్ట్ర ప్రాథమిక విద్యాశాఖా మంత్రి, నెల్లూరు అల్లుడు సాకే శైలజానాథ్‌కు కోపమొచ్చింది. కట్టుకథలు చెప్పబోయిన రాజీవ్ విద్యామిషన్ అధికారులపై చిటపటలాడారాయన. 9వ తేది కలెక్టరేట్‌లోని గోల్డన్ జూబ్లీహాల్‌లో ఆర్వీఎం, విద్యాశాఖ, వయోజన విద్యాశాఖ పనితీరును సమీక్షిస్తూ ఒక్కసారి ఆగ్రహోద్రగ్డుడయ్యాడాయన. రాజీవ్ విద్యామిషన్ పరిధిలో పనులు చేయను అడ్వాన్స్‌గా విధులు మంజూరు చేస్తున్నా శ్రీకాకుళం, విశాఖ ఏజెన్సీ ప్రాంతాల కంటే నెల్లూరు ఎందుకు వెనుకబడి ఉందో తెలియదు. స్కూళ్లలో వెయ్యి అదనపు గదులు కట్టమంటే ఒక్కటీ కట్టలేదు. అభివృద్ధి పనుల విషయమై కాకి లెక్కలు చెప్పడం మంత్రిలో సహనం చచ్చిపోయింది. మిమ్మల్ని మందలించడం దండగేనని ఆయన ఆర్వీఎం నెల్లూరు ప్రాజెక్ట్ అధికారిపై ఘాటుగానే స్పందించారు. నిధులుండి కూడా రాజీవ్ విద్యామిషన్ అధికారులు ఎందుకిలా చేస్తున్నారో అర్థం కావడం లేదు.



నెల్లూరు రత్నం విద్యాసంస్థల సైన్స్‌ఫేర్ 2012లో విజేతలకు బహుమతులు పంచుతున్న విద్యాసంస్థల అధినేత కెవి.రత్నం. ప్రక్కన రక్షణశాఖలో శాస్త్రవేత్త జి.సతీష్‌రెడ్డి.

## కలసికట్టుగా నల్లపురెడ్డి బ్రదర్స్!

స్వర్గీయ నల్లపురెడ్డి శ్రీనివాసులు రెడ్డి కుమారులు ముగ్గురూ తలోదారిలో నడిచేవారు. ఒక్కోపార్టీలో ఒక్కొక్కరుంటూ విమర్శలు చేసుకొనేవారు. విచిత్రంగా ప్రసన్నకుమార్‌రెడ్డి, రాజేంద్ర, జగదీష్‌లను వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఆకర్షించాడు. ముగ్గురూ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో కొనసాగుతూ కోవూరు నుంచి పోటీచేస్తున్న అగ్రజునికి అనుకూలంగా ప్రచారం చేయడం చూసేవారికి విచిత్రంగా తోస్తోంది. వీరి కలసికట్టు ప్రచారాన్ని వీరి మామ, కోవూరులో తెలుగుదేశం పార్టీ అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఏవిధంగా ఎదుర్కొంటాడో వేచి చూడాలి.

కొరవ 14వ పేజీలో

# కన్నెర్రజేసిన వివేకా!

● పట్టించుకోని విద్యార్థి లోకం



హత విధీ...

మాట వినని వారిని బెదరించడం, నయానా భయానా లొంగదీసుకోవడం, కాదు కూడదంటే ఇళ్లు కూలగొట్టించడం, కేసులు పెట్టించడం ఇది నగరంలో గత కొంతకాలంగా జరుగుతున్న రాజకీయం. తన పంచన చేరి ఎన్ని తప్పులు చేసినా, అక్రమంగా ఇళ్లు నిర్మించుకొన్నా, కాలువలు, రోడ్లు ఆక్రమించి భవంతులు కట్టుకొన్నా అడగని ప్రజాప్రతినిధులు తమకు గిట్టని పార్టీలు, నేతలు పెట్టే కార్యక్రమాలను అడ్డుకొనేందుకు యత్నించడాన్ని పలువురు విమర్శిస్తున్నారు. ఇటీవల వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ విద్యార్థుల ఫీజు రీఎంబర్స్‌మెంటుపై ధర్నా నిర్వహించింది. ఈ కార్యక్రమానికి వివిధ కళాశాలల నుంచి విద్యార్థులు పాల్గొనేలా కార్యక్రమాన్ని రూపొందించింది. ఈవిషయం తెలుసుకొన్న రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానంద రెడ్డి ఆయా కళాశాలల యాజమాన్యాలకు ఫోన్ చేసి మీ కళాశాలల నుంచి ఒక్క విద్యార్థి ఆ కార్యక్రమానికి పోవడానికి వీలులేదు. జాగ్రత్త, కాదని పంపితే పరిణామాలు తీవ్రంగా వుంటాయని బెదరించాడట. కార్యక్రమానికి విద్యార్థులను తరలించేందుకు బస్సులను పంపవద్దంటూ బస్సుల యాజమానులకు హుకుం జారీ చేశాడట. ఆయన మాట ఖాతరు చేయకుండా వివిధ కళాశాలల విద్యార్థులు పెద్దఎత్తున ఫీజుపోరుకు హాజరై తమ నిరసన తెలపడంతో వివేకానంద రెడ్డి కోపం నషాలానికి అంటింది. దీనికి ఆయన బస్సులు, కళాశాలలపై సంబంధిత అధికారుల చేత దాడులు చేయించి రకరకాలుగా ఇబ్బంది పెట్టేందుకు ప్రయత్నిస్తుండడం నగరంలో చర్చనీయాంశమయ్యింది.

# నెల్లూరీయునికి యువ శాస్త్రవేత్త అవార్డు!



యువ శాస్త్రవేత్త అవార్డును నావూరు శ్రీకాంత్‌కు అందిస్తున్న ఇస్రో ఛైర్మన్ రాధాక్రిష్ణన్.

నెల్లూరు శాంతినగర్‌వాసి నావూరు సుధాకర్ కుమారుడు షార్‌లో సీనియర్ శాస్త్రవేత్తగా పనిచేస్తున్న నావూరు శ్రీకాంత్ భారత అంతరిక్ష పరిశోధన సంస్థ ఇచ్చే ప్రతిష్టాత్మక యంగ్ సైంటిస్ట్ అవార్డుకు ఎంపికయ్యారు. ఈ అవార్డును శ్రీహరికోటలోని షార్ కేంద్రంలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ చేతుల మీదుగా అందుకోవాల్సింది. సమయాభావం వల్ల ఆమె వెళ్లిపోవడంతో ఈ అవార్డును ఇస్రో ఛైర్మన్ కె.రాధాకృష్ణన్ చేతుల మీదుగా శ్రీకాంత్ అందుకొన్నారు. ప్రశంసాపత్రంతోపాటు 50వేల నగదును భారత్ ప్రభుత్వం శ్రీకాంత్‌కు ఇచ్చింది. భవిష్యత్తులోనూ ఆయన మరిన్ని అవార్డులు పొందాలని ఆకాంక్షిస్తున్నాం.

# బుజబుజ నెల్లూరులో ఉచిత వైద్యశిబిరం

## 300 మందికి ఉచితంగా మందులు



ఉచిత వైద్య శిబిరాన్ని ప్రారంభిస్తున్న కళ్యాణం రాజగోపాల్.

నెల్లూరులోని సృజన సాహిత్య సాంస్కృతిక వేదిక ఆధ్వర్యంలో బుజబుజ నెల్లూరులోని శ్రీనివాస ఇంగ్లీషు మీడియం స్కూల్‌లో 8వ తేది ఉచిత వైద్య శిబిరం జరిగింది. నగరంలోని ప్రముఖ వైద్యులు డాక్టర్ మారం సుధాకర్, చిన్న పిల్లల వైద్యులు డాక్టర్ కె.శ్రీనివాసులరెడ్డి, దంతవైద్య నిపుణులు డాక్టర్ గణేష్ కలసి 300 మంది రోగులను పరీక్షించారు. వీరికి అవసరమైన 10వేల రూపాయల విలువ చేసే మందులను ఆంధ్రాబ్యాంక్ రిటైర్డ్ సీనియర్ బ్రాంచి మేనేజర్ కళ్యాణంరాజగోపాల్ వితరణ గావించారు. లయన్ డిస్ట్రిక్ ఛైర్మన్ ఎన్. సుబ్రహ్మణ్యం, సీనియర్ ఆడిటర్ ఆర్వీ శేషయ్య నాయుడు, పిగిలం సురేష్, బి.శేషు, కె.శకుంతలమ్మ, స్కూల్ కరస్పాండెంట్ సుబ్బయ్య, సృజనసంస్థ అధ్యక్షుడు దగ్గుపాటి రాధాకృష్ణ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



తన పాదయాత్రలో భాగంగా రూరల్ నియోజకవర్గ పరిధిలోని రామ్మూర్తి నగర్‌లో మాట్లాడుతున్న కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

# చంద్రబాబుపై ప్రేమ - జగన్‌పై ద్వేషం

కొన్నేళ్ల క్రితం వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఓదార్పు యాత్రకు వరంగల్ జిల్లాకు వెళ్తే రాష్ట్రప్రభుత్వం కేవలం 30మంది పోలీసులను రక్షణకు ఏర్పాటు చేసిందని, అదే ఈనాడు చంద్రబాబు అదే జిల్లాకు వెళ్తే 4వేల మంది పోలీసులను రక్షణ సమకూర్చిందని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి విమర్శించారు. 7వ తేదికి ఆయన చేపడుతున్న ఓదార్పుయాత్ర 62వ రోజుకు చేరుకొంది. నగరంలోని రామ్మూర్తి నగర్, గనిగుంట ప్రాంతాల్లో ఇంటింటికి వెళ్లి ఆయన వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ గూర్చి ప్రచారం సాగించారు. రాష్ట్రంలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు కుమ్మక్కై లోపాయికారి రాజకీయాలు చేస్తున్నాయన్నారు. మొన్నటి ఎం.ఎల్.సి ఎన్నికల్లో కాంగ్రెస్, తెలుగుదేశం నిస్సిగ్గుగా బహిరంగంగా కలసి పని చేశాయని, తెలంగాణలోని బాన్సువాడ ఎన్నికల్లో తెలుగుదేశంపార్టీ బహిరంగంగా కాంగ్రెస్ పార్టీకి మద్దతు ఇచ్చిందన్నారు. రాబోయే రోజుల్లో ఈ రెండు పార్టీలు కలసి పోటీ చేసినా ఆశ్చర్యపోనక్కర్లేదన్నారు. వైఎస్ మరణం తర్వాత రాష్ట్ర రాజకీయాలలో చిత్రవిచిత్రాలు జరుగుతున్నాయని, ఆ చిత్ర విచిత్రాలకు పరాకాష్ట కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీ పొత్తు అన్నారు. ఎవరు ఎన్ని కుట్రలు పన్నినా సోనియాగాంధీ, చంద్రబాబు, చిరంజీవి ఒకే వేదికమీదకు వచ్చి ఎన్నికల్లో ప్రచారం చేసినా వైఎస్‌ఆర్ కాంగ్రెస్ గెలుపుని, జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి కావడాన్ని ఆపలేరన్నారు. ఈ పాదయాత్రలో కెవి రాఘవరెడ్డి, ఖాజావలి, రూప్‌కుమార్ యాదవ్, దార్లవెంకటేశ్వర్లు, దేవిశెట్టి రాజగోపాల్, శ్రీదేవి, వెంకటేశ్వర్లు, శ్రీనివాసులు, కె.శరత్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.

# చెరువుల అభివృద్ధికి శ్రీకారం

జిల్లాలో ఉపాధిహామీ పథకం ద్వారా చెరువుల అభివృద్ధి జరుగనుంది. ఈ మేరకు రాష్ట్రప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. గ్రామీణాభివృద్ధిశాఖ ఆధ్వర్యంలో జరిగే ఉపాధిహామీ పథకం ద్వారా గతంలో చెరువుల అభివృద్ధి పనులు చేపట్టారు. అయితే ఈ పనుల నిర్వహణపై ఆరోపణలు, అభ్యంతరాలు తలెత్తడంతో ప్రభుత్వం పనులను తాత్కాలికంగా నిలిపి వేయడం జరిగింది. నీటిపారుదలశాఖ ఆధ్వర్యంలోనే ఇక నుంచి చేపట్టబోయే చెరువుల పనులకు ప్రతిపాదనలు తయారు చేయించాల్సి వుంటుంది. గ్రామీణ ప్రాంతాల్లో వున్న చిన్న, మధ్య తరహ చెరువుల అభివృద్ధి జరిగితే నీటి నిల్వలు పెరిగే అవకాశం వుంటుంది. నీటిపారుదలశాఖ అధికారులు రూపొందించిన ప్రతిపాదనలు జిల్లాకలెక్టర్ ఆమోదం పొందిన తర్వాతనే పనులు చేపట్టాలని ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వుల్లో పేర్కొంది.

# ఇఫ్కో భూములు తిరిగి ఇచ్చేయండి!

జిల్లాలోని కొడవలూరు మండలం రేగడిచెలిక వద్ద ఇఫ్కో సెజ్ ఏర్పాటు కోసం సేకరించిన భూముల్ని తిరిగి రైతులకు స్వాధీనం చేయాలన్న వాదన మొదలయ్యింది. రైతు సంఘం ఆధ్వర్యంలో ఇటీవల జిల్లా కలెక్టర్‌ను రైతులు కలసి పై విజ్ఞాపన చేశారు. వ్యవసాయ ఉత్పత్తుల ఏర్పాటు కోసం రైతుల నుంచి దాదాపు 2500 ఎకరాలను ప్రభుత్వం సేకరించడం జరిగింది. ఇది జరిగి సంవత్సరాలు గడుస్తున్నా సెజ్ ఏర్పాటు మాత్రం జరగలేదు. తిరిగి భూములు సేకరించే సమయంలో ఎకరాకు 40వేల రూపాయలు పరిహారంగా చెల్లించడం జరిగింది. జాతీయ రహదారి ప్రక్కనే వున్న ఈ భూములు ప్రస్తుతం మార్కెట్ ధర ప్రకారం ఎకరా 10 నుంచి 20లక్షల వరు పలుకుతుందని రైతులు చెబుతున్నారు. భూములు రైతులకు తిరిగి స్వాధీనం చేసేందుకు ప్రభుత్వం స్పందించకుంటే రాష్ట్ర హైకోర్టుకు వెళ్లాలని రైతుసంఘం ప్రతినిధులు నిర్ణయించారు. వ్యవసాయానికి ఉపయోగించే ఈ భూములు సంవత్సరాల తరబడి బీడుగా పడివున్నాయి. ఎవరి భూములు వారికి స్వాధీనం చేస్తే వ్యవసాయం చేసుకొంటామని అంటున్నారు.



శిలాఫలకాలకే పరిమితమైన ఇఫ్కో కిసాన్ సెజ్.

# జిల్లా అధికారుల్లో నపుంసకత్వం

- కనుపర్తిపాడు చెరువు దురాక్రమణపై చింతా మోహన్‌ది అరణ్య రోదనే.
- తాజాగా రమేష్‌రెడ్డి నగర్‌లో నీళ్ల ట్యాంక్ స్థలం దురాక్రమణ.
- ఆనమోళ్ల భూదాహం ఎంతకీ తీరేట్లు లేదు.
- కలెక్టర్, జాయింట్ కలెక్టర్లు  మంత్రిగారి కన్నెర్రకు మల మల మాడిపోతున్నారు.




కనుపర్తిపాడు చెరువు స్థలంలో యధాతథంగా వున్న కావేరి ఎస్టేట్స్

నెల్లూరు టౌన్‌లో ఆనం సోదరుల భూ ఆక్రమణలు, ధన దురాశ మితిమీరి పోతున్నాయి. అసలే అన్నదమ్ములకు నోటి దురుసు జాస్తి. ఆపై ఆర్థిక మంత్రిత్వమనే అధికారం చేతికి అందింది. కల్లు త్రాగిన కోతుల వలె రెచ్చిపోతున్నారు. ఎక్కడ ఖాళీస్థలం కనిపిస్తే అక్కడల్లా పాగా వేస్తున్నారు. నిర్భయంగా అమ్ముకొంటున్నారు. వందల కోట్లు కూడబెట్టుకొంటున్నారు. తమను అడిగేవాడు, అడ్డగించేవాడు లేడనే అహంకారంతో పెట్రేగి పోతున్నారు. మరీ ఇంత అన్యాయమా అన్న ఆవేదనతో తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ గత వారం కలెక్టర్, జాయింట్ కలెక్టర్ తదితర రెవిన్యూ అధికారులందరూ ఒకే చోట ఉన్న సమావేశానికి వెళ్లి, ఈ అక్రమణల గురించి ప్రశ్నించాడు. కనుపర్తిపాడు చెరువును ఇళ్లస్థలాలుగా అమ్మడాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించాడు. రాజకీయ పలుకుబడికి జంకి మీరు గుడ్డి వాళ్ల వలె కళ్లు మూసుకోవడం ఏమీ బాగాలేదని సుతిమెత్తగా మందలించాడు. మీ పద్ధతి మార్చుకోకపోతే నా నియోజకవర్గంలో చెరువులన్నింటినీ ఇళ్ల స్థలాలుగా పేదవాళ్లకు పంచుతానని హెచ్చరించాడు. ఒకటికి ఏడు సార్లు ఎమ్పీగా గెలిచిన సీనియర్ ప్రజాప్రతినిధి అంత కఠినంగా మాట్లాడినా కలెక్టర్ గారికి చురుకు ఎక్కలేదు. అది జరిగి పది రోజులు గడిచి పోయినా ఈనాటికీ ఆ చెరువులో ఇళ్ల స్థలాల అమ్మకాన్ని ఆపే కనీస ప్రయత్నం చేయలేదాయన.

చింతా మోహన్ కూడా దీన్ని అంత సులువుగా వదిలేట్లు కన్పించడం లేదు. తన ఆవేదన అరణ్య రోదనగా మారడం ఆయనకు ఆగ్రహం తెప్పించినట్లుంది. మరొకసారి కలెక్టర్‌కు చెప్పి, అప్పటికీ మార్పు రాకుంటే వెంకటాచలం గ్రామానికి ఆనుకొని ఉన్న కనుపూరు చెరువును పేదలకు పంచి పెట్టాలనే ఆలోచనలో ఉన్నట్లు వినికిడి. ఆయన ముందు నిలబడాలే కానీ, ఆ పరిసర గ్రామాలలోని వేలాది మంది పేదలు క్షణాల్లో ఆ చెరువును నివాస కాలనీగా మార్చి వేస్తారన్నది నిజం.

ఇదిట్లా ఉంటే ఎమ్పీ చింతామోహన్ చేసిన గీతోపదేశాన్ని కలెక్టరాది అధికారులు మౌనంగా ఆలకించడం కూడా తప్పై పోయినట్లుంది ఆనమోళ్ల దృష్టిలో. ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మొన్న శనివారం సాయంత్రం కలెక్టర్ బంగళాలో ఈ విషయమై వీరంగమాడాడట. కనుపర్తిపాడు చెరువు జోలికి వస్తే ఊరుకొనేది లేదని పెద్ద నోరు చేసుకొని అరిచాడట. చేతిలోని కాగితాలను పరపరా చించి రభస సృష్టించాడట. ఆయన రుసరుసలు, కసకసలు చూసి బిత్తర పోయారు కలెక్టర్ బంగళా సిబ్బంది.

వివేకా వికృత చేష్టలకు తగినట్లే ఉంది జిల్లా అధికారుల ప్రవర్తన కూడా. దాదాపు నాలుగు నెలల నుంచి కనుపర్తిపాడు వివాదం

కొరవ 14వ పేజీలో



బోగోలు మాజీ ఎమ్పీటిసి చిలకపాటి వెంకటేశ్వర్లుకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సభ్యత్వం ఇస్తున్న ఆ పార్టీ జిల్లా కన్వీనర్ గోవర్ధన్‌రెడ్డి, నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి.



నూతన సంవత్సర వేడుకల్లో భాగంగా కప్పరాళ్లతిప్ప బోడెన్ చర్చి నిర్వాహకుడు మేకల సాల్మన్ నిర్వహించిన ఆటల పోటీల్లో విజేతలకు బహుమతులందిస్తున్న బిట్రగుంట ఎస్ఐ ఖాజావలి.

# అనంతసాగరంలో ఇసుక మాఫియా!

● కడప జిల్లాకు రవాణా.

అనంతసాగరం మండలంలో ఇసుక అక్రమ రవాణా యదేచ్ఛగా సాగుతోంది. నేతల అండదండలు, అధికారులు లంచాల మత్తులో వుండడంతో రీచ్‌ల నుంచి ఇసుకను ఇష్టానుసారంగా త్రవ్వి తరలించి వేస్తున్నారు. మండలంలోని సోమశిల, పికె పాడు ఇసుక రీచ్‌లకు కోర్టు కేసుల వలన టెండర్లు పిలవలేదు. కడపకు చెందిన కొందరు స్థానిక నేతలతో ఒప్పందం కుదుర్చుకొని ట్రాక్టర్లను పెట్టి ఎడాపెడా ఇసుకను త్రవ్వి బద్వేలుకు తరలించుకుని వెళ్తున్నారు. దీనిపై నోరు మెదపకుండా వుండేందుకు అధికారపార్టీ నేతలతోపాటు పోలీసు, రెవెన్యూ, మైనింగ్ అధికారులకు నెలనెలా మామూళ్లు ముట్టజెపుతున్నారు. దీంతో బహిరంగంగా అధిక సంఖ్యలో ట్రాక్టర్లు మండలంలో తిరుగుతున్నా పట్టించుకొనేవారే లేకుండాపోయారు. దాదాపు రోజుకు 100 ట్రాక్టర్లకుపైగా ఇసుకను తరలించుకొని వెళ్తుండడంతో ఇప్పటివరకు 3కోట్లకుపైగా విలువ చేసే ఇసుక తరలి వెళ్లినట్లు సమాచారం. పెద్దఎత్తున ఇసుకను అక్రమంగా



సోమశిల ఇసుక రీచ్ నుంచి అక్రమ త్రవ్వకాలు.

రవాణా చేస్తున్నా అధికారులు, ప్రజాప్రతినిధులు పట్టించుకోకపోవడం వారి అవినీతిని బహిర్గతం చేస్తోంది. కడప జిల్లా గోపవరం, బద్వేలు, మైదుకూరు ప్రాంతాలకు చెందిన ట్రాక్టర్లు ఉత్తర కాలువ మీదుగా ఈ రీచ్‌ల వద్దకు చేరుకొని ఇసుకను తరలించుకొని వెళ్తున్నారు. జిల్లా కలెక్టర్ అయినా దీనిపై దృష్టి సారించి ఇసుక రవాణాను అరికట్టాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# వెంగమాంబపురంలో తాగునీటి సమస్య!

ప్రజలకు తాగునీరు అందించడంలో అధికారుల వైఖరిపై జిల్లా కలెక్టర్ తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. నాయుడుపేట మండలం వెంగమాంబాపురం వచ్చిన కలెక్టర్ శ్రీధర్‌కు అక్కడి గ్రామస్తులు వివిధ సమస్యలను ఏకరువు పెట్టారు. ముఖ్యంగా మంచినీరు అందక తాము పడుతున్న ఇబ్బందులను కలెక్టర్ దృష్టికి తీసుకొని వచ్చారు. తాగేందుకు గుక్కెడు మంచినీళ్లు దొరకడం లేదు. స్వర్ణముఖి నది నుంచి సరఫరా అవుతున్న మంచినీరు గ్రామానికి చేరడం లేదన్నారు. అరకొరగా వచ్చే నీరు దాహార్తిని తీర్చడం లేదని, ఈకారణంగా మంచినీటి కోసం దూరప్రాంతాలకు వెళ్లాల్సి వస్తోందని వాపోయారు. విధిలేని పరిస్థితుల్లో కలుషిత నీటినే

## సరిదిద్దమన్న కలెక్టర్

తాగాల్సి వస్తోందని దీని వలన అనారోగ్యం పాలవుతున్నామంటూ తమ దయనీయ స్థితిని కలెక్టర్‌కు వివరించారు. దీనికి స్పందించిన కలెక్టర్ పంచాయితీ అధికారులను మంచినీటి సమస్యపై ప్రశ్నించారు. మంచినీరు సక్రమంగా సరఫరా జరగకపోయినా ఎందుకు పట్టించుకోవడం లేదని ఆగ్రహించిన కలెక్టర్ తక్షణం మంచినీరు సరఫరా జరిగేలా చూడాలన్నారు. గత కొంతకాలంగా పరిష్కారం కాని మంచినీటి సమస్య కలెక్టర్ రాకతో సమసిపోవడం పట్ల గ్రామస్తులు ఆనందం వ్యక్తం చేస్తున్నారు.

# పంటనష్టాన్ని చూసిన బీద!

## గోడు వెళ్లబోసుకొన్న రైతులు

థానే తుపాను కారణంగా దెబ్బతిన్న పంటలను కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు పరిశీలించారు. కావలి రూరల్ మండలంలోని చెన్నాయపాళెం, అన్నగారిపాళెం, తుమ్మలపెంట, మన్నంగిదిన్నె, సర్వాయపాళెం పంచాయితీలలో దెబ్బతిన్న పంటలను పరిశీలించేందుకు వచ్చారు. ఈ సందర్భంగా స్థానిక రైతులు తమ గోడు వెళ్లబోసుకొన్నారు. పుచ్చ, వేరుశనగ పంటలు పూర్తిగా దెబ్బతినడాన్ని పరిశీలించిన ఆయన మాట్లాడుతూ చేతికి అందివచ్చిన పంట తుపాన్ తాకిడికి పనికి రాకుండా పోయిందన్నారు. దీని వలన కౌలు రైతులు అధికంగా నష్టపోయారన్నారు. అసలే అంతంత మాత్రంగా వున్న వారి బ్రతుకులు తుపాను కారణంగా ఆర్థికంగా కోలుకోలేని విధంగా దెబ్బతిన్నాదన్నారు. తక్షణం అధికారులు దెబ్బతిన్న ప్రాంతాలను పరిశీలించి పంట నష్టాలను అంచనా వేసి నివేదిక సిద్ధం చేయాలని ఆదేశించారు. ఎమ్మెల్యే వెంట టిడిపి నాయకులు రంగారావు, రవికుమార్‌రెడ్డి, చలపతి, ఇతర అధికారులు పాల్గొన్నారు.

# అంధకారంలో సున్నపు బట్టి!

## వీధిలైట్లు వెలగవు

చుట్టుప్రక్కల నాలుగైదు మండలాలకు కూడలి అయిన సున్నపుబట్టి ప్రాంతంలో అంధకారం అలుముకొని వుంటోంది. వీధిలైట్లు లేకపోవడంతో సాయంత్రమైతే చాలు చీకటి రాజ్యమేలుతుంటుంది. దగదర్తి మండల పరిధిలోగల ఈ ప్రాంతానికి చుట్టుప్రక్కల అల్లూరు, బుచ్చి, కావలి నుంచి నిత్యం పలువురు రాకపోకలు సాగిస్తుంటారు. రాత్రి వేళల్లో బస్సు దిగి వచ్చే ప్రయాణికులు ముఖ్యంగా మహిళలు వీధిలైట్లు లేని కారణంగా తిరగాలంటేనే హడలిపోతున్నారు. దీనికి తోడు అల్లరి మూకల ఆగడాలు ఈ ప్రాంతంలో అధికం కావడంతో వారు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు. సున్నపుబట్టి వద్ద వీధిలైట్లు ఏర్పాటు చేయాలని పలుమార్లు అధికారులను కోరినా ఫలితం లేకుండా పోయిందని స్థానికులు చెప్తున్నారు. ముఖ్య కూడలి అయిన సున్నపుబట్టీలో ప్రయాణికులు, స్థానిక ప్రజల ఇబ్బందులను దృష్టిలో వుంచుకొని వీధిలైట్లను ఏర్పాటు చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

● గొలుసుకట్టు ఏజంట్ల

# ఇళ్ల ముందు ధర్నా!

గూడూరు మండలంలో గొలుసుకట్టు పథకంలో డబ్బులు కట్టి మోసపోయిన బాధితులు తమకు న్యాయం చేయాలంటూ ఏజంటు ఇంటి ముందు ధర్నాకు దిగారు. తిప్పారప్పాడు గ్రామానికి చెందిన ప్రజలు ఏజంటు కమలాకర్ ఇంటి వద్దకు వచ్చి ఆందోళన చేపట్టారు. అధికారుల చుట్టూ కాళ్లరిగేలా తిరుగుతున్నా న్యాయం జరగడం లేదని వాపోయారు. ఇటీవల సిఐడి డిఎస్పీ విజయకుమార్ గూడూరు వచ్చిన సమయంలో బాధితులు ఆయన్ను కలువగా భారత్ ప్రేమసదన్, హిమ్ సంస్థ సభ్యులు తమ అదుపులో వున్నారని వారి ఆస్తుల

## గూడూరులో సరికొత్త కార్యక్రమం

వివరాలు సేకరిస్తున్నామని చెప్పిన ఆయన డిసెంబర్ 31 లోపల ఏజంట్లు తమ వద్ద వున్న డబ్బులు పోలీసుల సమక్షంలో తిరిగి చెల్లించాలని చెప్పినా అదెక్కడా అమలు కాకపోవడంతో బాధితులు ఆందోళన చెందుతున్నారు. అధికారులు ఎన్ని హెచ్చరికలు చేస్తున్నా ఏజంట్లు భయపడడంలేదని, తమ డబ్బులను తిరిగి ఇవ్వమని ప్రశ్నిస్తే సరైన సమాధానం చెప్పకుండా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నారంటూ ఆగ్రహించారు. డబ్బులు తిరిగి చెల్లించే గడువు పెంచిన సిఐడి అధికారులు మనీస్కీం ఏజంట్లపై ఎలాంటి చర్యలు చేపడుతారో వేచి చూడాల్సి వుంది.

# టిడిపిని భ్రష్టుపట్టిస్తున్నాడు!

తెలుగుదేశం పార్టీని భ్రష్టుపట్టిస్తున్న ఘనత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికే దక్కుతుందని కోవూరు మాజీ ఎమ్మెల్యే నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విమర్శించారు. ఉప ఎన్నికల బరిలో కోవూరు నుంచి వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ తరపున పోటీ చేస్తున్న ఆయన నియోజక వర్గంలోని పలు ప్రాంతాలలో పర్యటించి తనపై విమర్శలు చేస్తున్న టిడిపి అభ్యర్థి సోమిరెడ్డిపై ప్రతివిమర్శలకు దిగారు. ఎక్కడ పడితే అక్కడ మీటింగులు పెట్టి తనను విమర్శించే అర్హత సోమిరెడ్డికి లేదన్నారు. రెండుసార్లు సర్వేపల్లిలో ఆదాల ప్రభాకర్‌రెడ్డి చేతిలో పరాజయం పాలైనా ఇంకా బుద్ధి రాలేదని ఘాటుగా విమర్శించారు. ఈసారి ఆయనకు తన చేతిలో ఓటమి తప్పదని జోస్యం చెప్పారు. నెల్లూరు జిల్లాకు పరిశ్రమలు పెట్టేందుకు ఎవరు

## సోమిరెడ్డిపై ప్రసన్న విమర్శ

వచ్చినా, కొత్తగా నాయకులు వచ్చినా వారిని కలుసుకొని వారి నుంచి ఒక్కరోజులో సూటుకేసులు తీసుకొనే ప్రావీణ్యం చంద్రమోహన్‌రెడ్డి సొంతమని విమర్శించారు. తాను ఆదాల వద్ద నుంచి డబ్బులు తీసుకొన్నానని ఆరోపించిన సోమిరెడ్డి గతంలో ఇదే ఆదాల వద్ద 24లక్షల రూపాయలు తీసుకొన్నారని వచ్చిన ఆరోపణలపై జవాబు చెప్పాలన్నారు. బహిరంగ చర్చకు వస్తే ఎవరు పర్సెంటేజీలు తీసుకున్నది స్పష్టం అవుతుందని సవాల్ విసిరారు. ఎన్ని కుయుక్తులు పన్నినా కోవూరు ప్రజలు తననే ఎన్నికలలో గెలిపించి తీరుతారన్న నమ్మకాన్ని వ్యక్తం చేశారు ప్రసన్నకుమార్‌రెడ్డి.

● స్కూళ్లలో

# మరుగుదొడ్ల నిర్మాణం ఘోరం!

## విడవలూరులో సర్వశిక్షా అభియాన్ నిధులు దుర్వినియోగం

విడవలూరు మండలంలో విద్యార్థుల సౌకర్యం కోసం నిర్మిస్తున్న మరుగుదొడ్లు అత్యంత నాసిరకంగా వున్నాయి. సర్వశిక్షా అభియాన్ క్రింద మండలంలో ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో 45 మరుగుదొడ్లను నిర్మించేందుకు నిధులు మంజూరయ్యాయి. 15.75 లక్షల రూపాయలతో చేపట్టిన ఈ నిర్మాణాల్లో నాణ్యత కొరవడుతుండడం పట్ల మండలంలోని ప్రజలు, విద్యార్థుల తల్లిదండ్రులు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. అధికారుల పర్యవేక్షణ కొరవడడంతో నిర్మాణం చేస్తున్న అధికారపార్టీ నేతలు తూతూమంత్రంగా నిర్మిస్తున్నారు. దీనికి ఉదాహరణ హరిజనవాడలో నిర్మాణంలో వున్న మరుగుదొడ్డి గోడలు కూలిపోవడం. పరమనాసిరకంగా నిర్మిస్తున్న మరుగుదొడ్లు ఎంతకాలం వుంటాయోనని పలువురు సందేహం వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికైనా సంబంధిత అధికారులు ఈ నిర్మాణాలపై దృష్టి సారించి ప్రజాధనం వృధా కాకుండా చూడడంతోపాటు నాణ్యంగా పనులు జరిగేలా చూడాలని పలువురు కోరుకొంటున్నారు.

# హాస్టల్ భోజనంపై ఎమ్మెల్యే ఆగ్రహం!

● నీళ్ల సాంబారు, ఉడకని అన్నం పెడుతున్నారు



కలువాయి హాస్టల్‌లో భోజనం రుచి చూస్తున్న వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ.

కలువాయి హాస్టల్‌లో నాసిరకం ఆహారాన్ని విద్యార్థులకు పెట్టడంపై వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ఇటీవల కలువాయి వచ్చిన ఆయన మండల అధికారులతో కలసి బిసి హాస్టల్‌ను తనిఖీ చేశారు. ఆ సమయంలో పిల్లలకు పెట్టే ఆహారాన్ని చూసి తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశాడు. నీళ్లలాంటి సాంబారు, ఉడకని అన్నం పెట్టడాన్ని చూసిన ఎమ్మెల్యే వాటిని స్వయంగా రుచి చూశాడు. ఇది అన్నమా, నీళ్లలో పసుపు, కారం కలిపి నట్లుందేంది సాంబారా? మీరు ఇంట్లో ఇట్టే తింటారా!, పిల్లలకు ఇలాంటి ఆహారాన్ని పెట్టి మిగిలే సొమ్ము దిగమింగుతారా అంటూ మండిపడ్డారు. విద్యార్థులను దీనిపై రామకృష్ణ ప్రశ్నించడంతో సార్, మాకు రోజూ ఇలాంటి ఆహారమే పెడతారు. నెలనెలా కాస్మోటిక్స్‌కు ఇచ్చే డబ్బులూ ఇవ్వరు. వార్డెన్ ఎప్పుడూ హాస్టల్‌లో వుండడు. అడిగితే కొడతారని చెప్పడంతో హాస్టల్ వార్డెన్ ఎక్కడా అని అడగ్గా, ఆయన సెలవు పెట్టకుండా విధులకు గైర్హాజరైన విషయం బయటపడింది. 50మంది విద్యార్థులు హాస్టల్‌లో వుండగా వందమంది వున్నట్లు హాజరుపట్టికలో నమోదు చేయడాన్ని పరిశీలించిన ఆయన విద్యార్థుల పేరుతో ప్రభుత్వం ఇచ్చే సొమ్ముతో మీ జేబులు నింపుకొంటారా అని ఆగ్రహించారు. అక్కడి నుంచి జిల్లా సాంఘిక సంక్షేమ శాఖాధికారులతో ఫోన్‌లో మాట్లాడి విద్యార్థుల బాధలను, నాసిరకంగా పెడుతున్న ఆహారం విషయమై ప్రశ్నించారు. జిల్లా కలెక్టర్ దృష్టికి ఈ సమస్యను తీసుకెళ్తానని ఎమ్మెల్యే చెప్పారు. ఆయన ఆకస్మిక తనిఖీకి వచ్చిన విషయం తెలుసుకొన్న వార్డెన్ ఎల్లారెడ్డి మొదటి తప్పుగా క్షమించమని తనకు తెలిసిన టిడిపి నాయకుల ద్వారా చెప్పించడంతోపాటు జిల్లా సాంఘిక సంక్షేమశాఖాధికారులు చర్యలు తీసుకోకుండా పెద్ద మొత్తంలో నజరానా సమర్పించినట్లు సమాచారం.

● ఎర్రచందనం

# స్మగ్లింగ్‌పై దృష్టి!

ఎర్రచందనం స్మగ్లింగ్‌లో కీలకంగా వ్యవహరిస్తున్న వారి వివరాలను సేకరించడంతోపాటు, వారి కదలికలపై నిఘా పెడుతున్నట్లు గూడూరు డిఎస్పీ సురేష్‌కుమార్ తెలిపారు. వెంకటగిరిలో ఎర్రచందనం దుంగలను పట్టుకున్న ఆయన విలేకరులతో మాట్లాడుతూ డిఎస్పీగా బాధ్యతలు చేపట్టాక ఇప్పటివరకు 250 దుంగలను పట్టుకొని, ఆరు వాహనాలను స్వాధీనం చేసుకొన్నామని, ఎనిమిది మందిని అరెస్టు చేశామన్నారు. ప్రపంచంలోనే

## గూడూరు డిఎస్పీ వెల్లడి

అరుదైన ఎర్రచందనం వృక్ష సంపదను కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరిపై వుందన్నారు. పోలీసులకు ప్రజలు సహకరించి ఎప్పటికప్పుడు తమకు తెలిసిన సమాచారాన్ని అందించాలని కోరారు. ప్రతి గ్రామంలో దీని కోసం ప్రత్యేకంగా నిఘా కమిటీలను ఏర్పాటు చేస్తున్నామన్నారు. సక్రమంగా విధులు నిర్వహించిన వారికి అవార్డులు, రివార్డులు అందజేస్తామని ప్రకటించారు.

# నిరుపయోగంగా ప్రజా సేవా కేంద్రాలు!

⇨ గూడూరు డివిజన్‌లో పరిస్థితిది ⇦

ప్రజలకు సత్వర సేవలు అందించే ఉద్దేశంతో ఏర్పాటైన ప్రజాసేవ కేంద్రాలు నిరుపయోగంగా మారుతుండడం పట్ల ప్రజలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. గూడూరు నియోజకవర్గ పరిధిలోని వివిధ మండల కేంద్రాల్లో వీటిని ఏర్పాటు చేసినప్పటికీ అవి ప్రజలకు ఏరకంగానూ ఉపయోగపడడం లేదట. వివిధ సమస్యలపై ప్రజలు కార్యాలయాల చుట్టూ తిరుగుతున్నా వారు కోరిన సర్టిఫికేట్లు మాత్రం అందడం లేదు. ప్రజలకు ఏఏ సర్టిఫికేట్లు అందజేయబడుతాయో, ఎంత సమయం పడుతుందో సిటిజన్ చార్టర్ ఏర్పాటు చేసినప్పటికీ ఆచరణలో మాత్రం ఒక్క పని కావడం లేదు. చిన్న చిన్న సమస్యలపై వచ్చే వాళ్లు ధృవీకరణ పత్రాల కోసం వచ్చే వాళ్లు రోజుల తరబడి సేవాకేంద్రాల చుట్టూ తిరగాల్సి రావడంతో అల్లాడిపోతున్నారు. అడంగళ్ కాపీలకు రైతులు నెలల తరబడి ఎదురుచూడాల్సి వస్తోంది. గూడూరు తహశీల్దార్ కార్యాలయంలో సేవలు అందని వైనంపై సబ్‌కలెక్టర్‌కు ఫిర్యాదు చేయడంతో ఆయన ప్రజాసేవా కేంద్రాన్ని ఇటీవల తనిఖీ చేశారు. ఆయన పంపిన మెయిల్స్‌ను అధికారులు చూడకపోవడంపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. మరొకసారి ప్రజలకు అవసరమైన సర్టిఫికేట్లు అందజేయడంలో అలసత్వం వహిస్తే ఉపేక్షించేది లేదని హెచ్చరించారు.

# సకల శుభాల సంక్రాంతి



మహాపురుషులు జన్మించిన రోజులు, దుష్టులు కడతేరిన రోజు పండుగలుగా జరుపుకొంటుంటారు. ఇవి కాకుండా గ్రహ సంచారంతో మానవాళికి విక్రాంతి ఏర్పడే, మంచి జరిగే పుణ్య దినాలను పర్వదినంగా జరుపుకోవడం ఆనవాయితి. అలాంటి వాటిలో సంక్రాంతి పండుగ ముఖ్యమైనది. సంక్రాంతి అనగానే పల్లెలు గుర్తుకు వస్తాయి. ఇంటి ముందు రంగవల్లులు, గంగిరెద్దులు, హరిదాసు కీర్తనలు, ధాన్య రాశులతో కళకళలాడే వాతావరణం సంక్రాంతి పండుగకు వస్తుంది. అన్ని పండుగలలోకి ఆనందోత్సాహాలను కల్గించే పండుగ కనుక దీనికి పెద్ద పండుగ అని పేరొచ్చింది.

సూర్యుడు ఒక రాశిలో నుంచి మరొక రాశిలోకి మారడాన్ని సంక్రమణం అంటారు. పన్నెండు రాశులలో ప్రతి మాసంలో సూర్యుడి గమనాన్ని బట్టి ఉత్తరాయణం, దక్షిణాయణం ఏర్పడుతాయి. సూర్యభగవానుడు ప్రక్కరాశిలోకి మారే సందర్భంలో ఏర్పడే సంక్రమణాల్లో ముఖ్యమైనవి. ఆషాఢ మాసంలో జరిగే సంక్రమణాన్ని కర్కాటక సంక్రమణమని అంటారు. ఇది దక్షిణాయనంలో వస్తుంది. పుష్యమాసంలోకి జరిగే సంక్రమణాన్ని మకర సంక్రమణం అంటారు. దీనితో ఉత్తరాయణం ఆరంభమవుతుంది. ఉత్తరాయణంలో వైకుంఠద్వారాలు తెరచి వుంటాయని చెప్తారు. ఈ కాలంలో వచ్చే పండుగ కనుక సంక్రాంతికి అంతటి విశిష్టత వుంది. మూడు రోజుల పాటు జరుపుకొంటారు. మొదటి రోజు భోగి, రెండవరోజు సంక్రాంతి, మూడవరోజు కనుమ పండుగగా జరుపుకోవడం ఆనవాయితి.

భోగి పండుగ భోగభాగ్యాలను అందించే పండుగ. తెల్లవారుజామున ఇళ్ల ముందు భోగిమంటలు వేస్తారు. ఇళ్లలోని పాత సామాన్లను, కొయ్య సామగ్రిని, తాటాకులతో కలిపి మంట వేస్తారు. చలి నుంచి రక్షణ పొందడంతోపాటు ఆనాటి నుంచి పాత జీవితాన్ని, వదలి కొత్త జీవితాన్ని వెచ్చని ఊహలతో భోగ భాగ్యాలతో చవి చూడడం అని అర్థం. ఆరోజు సాయంత్రం పిల్లలకు భోగిపండ్లు పోస్తారు. రేగుపళ్లను బదరీ ఫలాలు అంటారు. విష్ణువుకు ప్రీతికరమైన వీటిని విష్ణుమూర్తి స్వరూపాలుగా చెప్తారు. ఈ పండ్లను పిల్లలపై పోయడం వల్ల శ్రీహరి కరుణాకటాక్షాలు లభిస్తాయని నమ్మకం. రెండోరోజు సంక్రాంతి పండుగ. ఈ పండుగనే పెద్ద పండుగ అంటారు. అల్లుళ్లు, ఆడపడుచులు, బంధుమిత్రులను ఇంటికి ఆహ్వానించి సాంప్రదాయ వంటకాలతో ఆనందంగా గడుపుతారు. తర్వాతి రోజును కనుమగా జరుపుకొంటారు. ఇది పశువుల పండగ. ఆవులు, గేదెలు ఇతర పశుసంపదను అలంకరించి ఆ మూగజీవాలను పూజిస్తారు. జనావళికి అన్నం పెట్టే కర్షకులు ఆనందోత్సాహంతో జరుపుకొనే ఈ పండుగ నిజంగా పెద్ద పండుగే.





## ట్రంకురోడ్డు

### యూత్ ఎవరు?




యూత్ కాంగ్రెస్‌ను యువకులతో నింపాలన్న రాహుల్ గాంధీ స్వప్నాన్ని నిజం చేయను నెల్లూరు ఇందిరాభవన్‌కు కేరళ నుంచి ప్రత్యేక పరిశీలకురాలు టిఎస్ఆర్ సుధా తరలివచ్చారు. యువజన కాంగ్రెస్ ఎన్నికలు పక్కాగా నిర్వహించుకొందామని, యువజన కాంగ్రెస్‌లో 18 నుంచి 35 ఏళ్ల మధ్య వారే వుండాలని ఉపన్యాసం దంచారామె. ఈ సమయంలో వేదికపై ఆమెతోపాటు నలభై దాటిన బాలసుధాకర్, బర్న బాస్, కోటీశ్వరరెడ్డి వంటి వయో'జన' నాయకులుండడం ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### ఎన్నాళ్ల కెన్నాళ్లకు...



ఎన్నాళ్ల కెన్నాళ్లకు అని ఓ సినీ కవి వ్రాసిన పాటను ఎరగడ్డలను కొనుగోలు చేస్తూ నెల్లూరు మహిళలు పాడుకొనే రోజొచ్చింది. గత ఏడాది ఆల్ టైం రికార్డుగా కిలో 70 రూపాయలమ్మిన ఎరగడ్డలు ఈ వారంలో అదీ పండుగల సీజన్‌లో... కిలో ఐదు, ఎనిమిది రూపాయల మధ్య అమ్ముతున్నారు. ఇవి పచ్చిగడ్డలని కొందరు పెదవి విరవవచ్చు. మార్కెట్‌లో ఇప్పుడు అమ్ముతున్న వన్నీ పచ్చిగడ్డలే. ఈ పండుగకు కావాల్సినన్ని ఎరగడ్డలు వేసుకొని ఉప్పు చెక్కలు చేసుకో వచ్చు. భోగిరోజు వడల్లో ఫుల్‌గా ఎరగడ్డలు దట్టించి నాటుకోడి కూరను ముంచుకొని మస్తుగా తినొచ్చు. ఎప్పుడో మరచిపోయిన ఎరగడ్డల పులుసు రేట్లు పెరిగే వరకు దినం మార్చి దినం చేసుకోవచ్చు. ఇక అతివలదే ఆలస్యం!

### పనికిమాలిన రోషం!



నెల్లూరు కార్పొరేషన్ ఉద్యోగులు సోగ్గాళ్లుగా మారి పోయారు. డ్యూటీ సక్రమంగా చేయరు. లంచాల మేతలో లంచగాళ్లుగా మారిపోయారు. ఈ వ్యవహారాన్ని బాగా గమనించి కార్పొరేషన్ ప్రత్యేకాధికారి లక్ష్మీకాంతం వీరిని మందలించేసరికి రోషమొచ్చింది. ఆడలేక మద్దెల ఓడు సామెతను గుర్తు చేస్తూ వీరంతా కార్పొరేషన్‌లో సకల అక్రమాలకు కారకుడైన ప్రజాప్రతినిధిని ఆశ్రయించారు. ఆ అయ్యోరు పని చేయమని గదమాయిస్తున్నాడు. ఆయన్ను అదుపు చేయమని రెడ్డి గారికి చెప్పుకొని వచ్చారు. కిర్రు చెప్పులు చేతబట్టి పని చేయకపోతే ఎలానోయ్‌నని ఆయన చెప్పకుండా వీరి పితూరీలు వినడంపై ట్రంకురోడ్డులో వాడివేడి చర్చ జరుగుతోంది.



### కోడి పందెం - క్రిమినల్ కేసు!

పండుగ నెలంటే గ్రామీణ ప్రాంతాల్లో మస్తుగా కోడి పందాలు జరుగుతాయి. నెల్లూరులో లేదు కాని కొన్ని జిల్లాలలో ఎమ్మెల్యేలే కోడి పుంజులను చేత పట్టుకొస్తారు. రూరల్ సిఐ జయరామసుబ్బారెడ్డికి స్వేచ్ఛగా డ్యూటీ చేసే అధికారం రావడంతో 'సన్ డే' రెచ్చిపోయారు. నెల్లూరు రూరల్‌లోని సజ్జాపురం, సౌత్ మోపూరు, ములుమూడి, కొత్తవెల్లంటి, సౌత్ వెల్లంటి గ్రామాల్లో కోడి పందెపు రాయుళ్లను 35 మందికిపైగా అరెస్ట్ చేసి 30వేలు, ఎనిమిది పందెపు కోళ్లు, నాలుగు బైక్‌లను కోర్టులో ప్రవేశ పెట్టారు. కోడి పందెం వేస్తే క్రిమినల్ కేసులు పెడతానంటూ సినిమా యాక్టర్ రాజశేఖర్ లెవల్‌లో చెప్పినా జయరాముని పట్టించుకొనే వారే లేరు.

## ఆ వైభవానికి వాస్తు మహత్యమే కారణమా!




రాష్ట్ర సచివాలయంలోని 'డి' బ్లాక్ సెల్లార్‌లో వున్న ఓ ఛాంబర్ యిప్పుడు వార్తల్లోకెక్కింది. గతంలో యిదే ఛాంబర్‌లో కెవిపి వుండేవాడు. ప్రస్తుతం కెసి.రెడ్డికి ఈ ఛాంబర్‌ను కేటాయించారు. సిఎం ప్రతిష్టాత్మక పథకం 'రాజీవ్ యువకిరణాలు'కు కెసి.రెడ్డి ప్రత్యేకాధికారిగా నియమితులయ్యాడు. గతంలో కెవిపి వున్నప్పుడు మంత్రులు, ఐఎఎస్, ఐపిఎస్‌లతోపాటు పారిశ్రామిక వేత్తలు, బడాబాబులు ఈ ఛాంబర్ చుట్టూ ప్రదక్షణం చేసేవారు. అదే ఆనవాయితీ ఇప్పుడు కూడా కొనసాగుతోంది. సిఎం మేధోపుత్రిక నిర్వహణకర్తగా కెసి.రెడ్డి పలుకుబడి బాగా పెరిగింది. దీంతో ఐఎఎస్, ఐపిఎస్ లంతా మంచి పోస్టింగుల కోసం ఆయన ఛాంబర్ ముందు పడిగాపులు కాస్తున్నారు. అలాగే సిఎం ఇంటర్వ్యూ కావాలనుకొనేవారు కూడా కెసి.రెడ్డిని సంప్రదిస్తుండడంతో ప్రస్తుతం ఆయన ఛాంబర్ కీలకంగా మారింది. దీంతో ఆ ఛాంబర్‌కు వాస్తు బాగా కుదిరిందంటూ సచివాలయ సిబ్బంది చెవులు కొరుక్కుంటున్నారు.

## ఈసారైనా 'చిరు' విస్తరణ జరిగేనా?




రాష్ట్ర మంత్రివర్గంలో చిరంజీవి వర్గీయుల ప్రవేశంపై రాజధానిలో ఉత్కంఠత నెలకొంది. ప్రజారాజ్యం పార్టీ కాంగ్రెస్‌లో విలీనం అయ్యాక ఆ పార్టీ ఎమ్మెల్యేలకు మంత్రి పదవులు దక్కుతాయని అందరూ భావించారు. అయితే రాష్ట్ర రాజకీయంలో నెలకొన్న స్తబ్దత కారణంగా 'చిరు' విస్తరణ వాయిదా పడుతోంది. ఇటీవల విస్తరణ ఖాయమనుకున్నప్పటికీ సిఎం కిరణ్ అడ్డుపడటంతో మళ్లీ వాయిదా పడింది. దీంతో చిరువర్గీయుల్లో తీవ్ర అసంతృప్తి నెలకొంది. ఇదే విషయాన్ని 'చిరు' కాంగ్రెస్ రాష్ట్ర పరిశీలకుడు గులామ్‌నబీ ఆజాద్ దృష్టికి తీసుకవెళ్లాడట. అసెంబ్లీలో అత్తెసరు మెజారిటీతో వున్న కాంగ్రెస్ నిలబడాలంటే తమ ఎమ్మెల్యేలకు మంత్రి పదవులు యివ్వాల్సిందేనని 'చిరు' తన మనసులో బాధను కాస్తంత తీవ్రంగానే వ్యక్తం చేసినట్లు భోగట్టా. దీంతో ఆజాద్ కూడా స్పందించి మేడమ్‌ను సంప్రదించాడట. ఈ నెల 17న గానీ, 19న గానీ 'చిరు' వర్గానికి చెందిన గంటా శ్రీనివాసరావును, రామచంద్రయ్యను మంత్రి వర్గంలోకి తీసుకోవాలంటూ ఆజాద్ సిఎంకు గ్రీన్ సిగ్నల్ యిచ్చాడంటున్నారు. అయితే సిఎం మాత్రం యిప్పటికీ విస్తరణ పట్ల అయిష్టంగా వున్నాడట చూద్దాం. ఏం జరుగుతుందో!

## తెలుగుదేశం పార్టీకి బాలయ్య గ్లామర్



తెలుగుదేశం పార్టీకి ఇప్పుడు బాలకృష్ణ గ్లామర్ అద్దే పని జరుగుతోంది. చంద్రబాబు నాయకత్వంతో మొఖం మొత్తిన కార్యకర్తలు, నాయకుల్లో కొత్త ఉత్సాహం నింపడానికి త్వరలోనే బాలకృష్ణను తెరపైకి తీసుకురానున్నారు. బాలకృష్ణను ఎన్నికల్లో పోటీ చేయించడం ద్వారా తెలుగుదేశం పార్టీలో సరికొత్త ఆకర్షణను నింపాలని చంద్రబాబు నిర్ణయించాడు. ఇటీవల శ్రీరామరాజ్యంలో రాముడిగా జనహృదయాలకు దగ్గరైన బాలకృష్ణను ఎన్నికల ప్రచారానికి ప్రధానాకర్షణగా మార్చాలన్నది బాబు వ్యూహమట. గత ఎన్నికల్లో ప్రచారం నిర్వహించిన జూనియర్ ఎన్టీఆర్ అలిగి తెలుగుదేశంకు దూరంగా వుంటున్నాడు. జనాకర్షణ కలిగిన బాలకృష్ణ ద్వారా ఆ లోటును భర్తీ చేయాలని 'బాబు' భావిస్తున్నాడు. బాలకృష్ణ క్రియాశీలక రాజకీయ ప్రవేశం పట్ల తెలుగుతమ్ముళ్లు కూడా హర్షం వ్యక్తం చేస్తున్నారు. దీంతో తెలుగుదేశంలో త్వరలో మరో అధికార కేంద్రం ఏర్పడే సూచనలు కన్పిస్తున్నాయంటూ తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో చెవులు కొరుక్కుంటున్నారు.

## తెలంగాణలో జగన్‌కు టీఆర్ఎస్ అండ



సమైక్యవాది జగన్‌కు తెలంగాణలో టిఆర్ఎస్ అండగా నిలిచింది. నిజామాబాద్ జిల్లా ఆర్మూర్‌లో జగన్ చేపట్టిన మూడు రోజుల రైతుపోరు దీక్షకు గులాబీ వర్గాలు తెరవెనుక నుంచి అండదండలందించాయి. సమైక్యాంధ్ర కోరుతున్న తెలుగుదేశం అధ్యక్షుడు చంద్రబాబు ఇటీవల తెలంగాణలో పర్యటించినప్పుడు టిఆర్ఎస్ వర్గాల నుంచి తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. బాబు తెలంగాణలో అడుగు పెట్టిన దగ్గర నుంచి రాళ్లతో స్వాగతం పలికారు. చివరకు బాబు బహిరంగ సభలో ప్రసంగిస్తున్నప్పుడు చెప్పులు విసిరి నానా రభస చేశారు. ఈ నేపథ్యంలో సమైక్యాంధ్ర నినాదం తలెత్తుకున్న జగన్ తెలంగాణ పర్యటనలో కూడా తీవ్ర వ్యతిరేకత వ్యక్తమౌతుందని భావించారు. రాజకీయ జెఎసి ఛైర్మన్ కోదండరామ్ కూడా జగన్‌ను అడుగుపెట్టనివ్వమంటూ బహిరంగ ప్రకటన కూడా చేశాడు. అయితే ఆచరణలో మాత్రం ఇందుకు భిన్నంగా జరిగింది. జగన్ తెలంగాణ పర్యటనలో ఒకటీ అరా సంఘటనలు తప్ప అంతా సజావుగా జరిగింది. ఆర్మూర్ దీక్ష కూడా శాంతియుతంగా కొనసాగింది. తెలంగాణలో జగన్ మూడు రోజుల పాటు దీక్ష నిర్వహించినా గులాబీ వర్గాలు ప్రేక్షకపాత్ర వహించాయి.

# వారఫలాలు

*తేది 14-01-2012 నుండి 20-01-2012 వరకు మేషంలో గురువు; వృషభంలో కేతువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; ధనుస్సులో బుధుడు; కుంభంలో శుక్రుడు; ధనుస్సులో రవి 14తేది రాత్రి 12.48 వరకు తదుపరి మకరంలోకి ప్రవేశం; సింహ, కన్య, తుల, వృశ్చికరాశులలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అనుకూలం. ఆర్థికాదాయం బాగుంటుంది. ప్రయాణాల పట్ల ఆసక్తి, అనవసరపు ఖర్చులు అధికం. నూతన వస్తువులు సమకూర్చుకుంటారు. ఇంటి యందు సుఖశాంతులు వుంటాయి. వ్యవసాయదారులకు అనుకూలంగా వుంటుంది. విద్యార్థుల చేసే ప్రయత్నాలు ఫలించవు. దైవ కార్యాలలో పాలు పంచుకోవడం మంచిది.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో వారికి సామాన్యంగా వుంటుంది. ఆర్థికాదాయం స్వల్పంగా వుంటుంది. ఖర్చులు అధికంగా వుంటాయి. శరీరారోగ్య స్థితిలో లోపం ఏర్పడగలదు. తీర్థయాత్రల పట్ల ఆసక్తి. చిక్కులు చికాకులు తప్పవు. వ్యవసాయ రంగంలోని వారికి సామాన్యంగా వుంటుంది. విద్యార్థులు గట్టి ప్రయత్నాలు చేయవలసి వుంటుంది.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు సామాన్యంగా వుంటుంది. శరీరారోగ్య లోపం. జాగ్రత్త పడడం మంచిది. చేయు కార్యక్రమాలందు గట్టి ప్రయత్నం వల్ల పనులలో జయం కలుగుతుంది. భూమిపై విశేష లాభం వుంటుంది. పిల్లల ఆరోగ్యం పట్ల ఆందోళన. విద్యార్థులు కష్టించిన ఫలితాలు అనుకూలిస్తాయి. తల్లి ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలు చేసేవారికి ఆర్థిక ఆదాయ వ్యవహారాలు బాగున్నప్పటికీ అధిక ఖర్చులుంటాయి. ఎంత పొదుపు చేయాలనుకున్నా వీలుకాదు. శత్రు రుణ రోగాలు హెచ్చుగా వుంటాయి. పిల్లల పట్ల శ్రద్ధ అవసరం. తల్లి ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. వ్యవసాయం సామాన్యంగా వుంటుంది. వివాహ శుభ కార్యాలు వాయిదా పడవచ్చు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి కష్టతరంగా వుంటుంది. ఎదురు చూసిన సత్ఫలితాలు దక్కవు. వృత్తిలో ముందంజ వేయలేరు. కుటుంబ వ్యవహారాల పట్ల శ్రద్ధ అవసరం. తల్లి దండ్రుల పట్ల శ్రద్ధ అవసరం. ఈ కాలం ఒక పరీక్షా సమయం. వ్యవసాయదారులకు, విద్యార్థులకు స్వల్పంగా యోగించును. శత్రువుల పట్ల, చెడు స్నేహితులకు దూరంగా వుండాలి.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగస్తులకు ధనాదాయం వున్నప్పటికీ, శత్రు రుణములు కూడా వుంటాయి. పితృ సౌఖ్యం తక్కువ. ఇంటి యందు శుభకార్యాలందు మంచి జరుగుతుంది. వ్యవసాయదారులకు అనుకూలతలుంటాయి. విద్యార్థులు ఉత్సాహం కలిగి వుంటారు. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగస్తులకు సామాన్యంగా వుంటుంది. ఆర్థిక, ఆదాయ వ్యయాలందు సామాన్యంగానే వుంటుంది. కళత్ర ఆరోగ్య విషయమై జాగ్రత్త అవసరం. వ్యవసాయదారులకు అనుకూలం. విద్యార్థుల తెలివి తేటలకు ఇది పరీక్షా కాలం. ఇంటి యందు శుభకార్యాలు వ్యయప్రయాసలతో కూడి వుంటాయి. కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసి రావచ్చు.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి చేసే పనులందు శ్రద్ధ అవసరం. కుటుంబ వ్యవహారాలందు భేదాభిప్రాయాలు కలుగవచ్చు. తీర్థయాత్రలు చేయడం వల్ల ధన వ్యయం కాగలదు. శరీరారోగ్యంపై విశేష జాగ్రత్తలు అవసరం. ఆర్థిక వ్యవహారపు చిక్కులు ఏర్పడగలవు. వ్యవసాయదారులకు అనుకూలం. విద్యార్థులకు కొంత మేలు వుంటుంది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలు చేసేవారికి ఆర్థిక ఆదాయాలు అనుకూలించును. ఇంటి యందు శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తాయి. దేవ, బ్రాహ్మణుల భక్తికార్యములను కలిగియుందురు. పితృ సౌఖ్యం తక్కువగా వుంటుంది. మాతృవర్గం వారికి ప్రతికూలత వుంటుంది. వ్యవసాయదారులకు ఆదాయం బాగుంటుంది. విద్యార్థులు తమ విద్యలపై శ్రద్ధ కలిగి వుండవలెను.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు యోగించదు. వ్యవహారపు చిక్కులు అధికంగా వుంటాయి. తరచూ ప్రయాణాల వల్ల ధన వ్యయం. ఇంటి యందు చిక్కులు, సమస్యలు కూడి వుంటాయి. కళత్ర విచారం చేయవలెను. అకస్మాత్తుగా ధనాదాయం కలుగుతుంది. వ్యవసాయదారులకు అనుకూలం. విద్యార్థులకు లాభం కలిగించును. శుభకార్యాలు వాయిదా వేయుట మంచిది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు స్వల్పంగా యోగించును. శరీర కష్టం కలిగించును. ఆరోగ్య లోపం తక్కువగా వున్నది. ఆర్థిక, ఆదాయాలున్నప్పటికీ అధిక వ్యయం. లాభాలకంటే నష్టాలు అధికంగా వుంటాయి. వ్యవసాయం చేసే వారికి ఆదాయం తగ్గినప్పటికీ అనుకూలంగా వుంటుంది. విద్యార్థులకు స్వల్ప అనుకూలతలు వుంటాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఆదాయ వ్యయాలు సమానంగా వున్నాయి. స్వల్పంగా యోగించును. స్వతంత్ర వృత్తి వల్ల ఆర్థిక ఆదాయం వుంటుంది. వ్యవసాయదారులకు అనుకూలం. శరీరారోగ్యంపై శ్రద్ధ అవసరం. కుటుంబ వ్యవహారాలలో చిక్కులు వుంటాయి. స్త్రీల ద్వారా ఆర్థికాదాయం వుంటుంది. విద్యార్థులకు అనుకూలమైన కాలం.

## పంచాంగం

14వ తేదీ భోగి పండుగ.
15తేదీ మకర సంక్రాంతి. ప్రయుక్త ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభం.
16తేదీ కనుమ పండుగ.
17తేదీ ముక్కనుమ. సావిత్రిగౌరి వ్రత ప్రారంభం.
19తేదీ మతత్రయ ఏకాదశి.

**శుభ ముహూర్తాలు లేవు.**

**జనవరి తిథులు**

**పుష్య బహుళ**

| | | | |
|---|---|---|---|
| 14 | శని | పంచమి | ఉ 07.28 గం.ల.వ |
| | తదుపరి | షష్ఠి | తె 05.36 గం.ల.వ |
| 15 | ఆది | సప్తమి | రా 03.37 గం.ల.వ |
| 16 | సోమ | అష్టమి | రా 01.38 గం.ల.వ |
| 17 | మంగళ | నవమి | రా 11.34 గం.ల.వ |
| 18 | బుధ | దశమి | రా 09.31 గం.ల.వ |
| 19 | గురు | ఏకాదశి | సా 07.31 గం.ల.వ |
| 20 | శుక్ర | ద్వాదశి | సా 05.34 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# అపార్టుమెంటు ఫ్లాటు లోటుపాట్లకు యంత్ర సారస్వత నిర్దేశాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*వై.రాజ్యలక్ష్మి — నెల్లూరు*

** మా అపార్టుమెంటు చెరువుకు సమీపంలో ఉంది. జలదోష ప్రభావం ఉంటుందా?*

నెల్లూరు పట్టణ పొదలకూరురోడ్డు ప్లాట్లకు 'జలదోషం', పశ్చిమ వరుణ దోషాలుంటాయి. దంపతుల పేర్లు, ప్లాటు దిక్కును గణించి మత్స్య లేక కూర్మ యంత్రాన్ని నిర్ణయిస్తారు.

*సూర్యనారాయణ సిద్ధాంతి — గుంటూరు*

** వీధిపోటు ఉంటే గణపతిని ప్రతిష్టించాము. పద్ధతులు చెప్పండి.*

ఆ బాక్సుకు అద్దం తలుపు, దీపం/లైటు వెలగడం, రోజూ పూజ జరగడం ముఖ్యం! గణపతిని దిష్టిబొమ్మలా ఉంచితే దోషం. గృహస్తుపై దుష్ఫలితాలుంటాయి.

*జి.తిరుపతిరెడ్డి — ఒంగోలు*

** వృక్షాల్ని కొట్టి జీవించడం అతని వృత్తి. అతను మధ్య వయస్సులో మంచానపడ్డాడు.*

వృక్షం మరణిస్తూ శపిస్తుందట. ఆ ఘోష, వేధ మానవుల్ని పీడిస్తాయని 'సిద్ధాంత సింధు' గ్రంథంలో నిత్యానంద మహర్షి విపులీకరించారు. అందువల్లే అతను మంచాన పడ్డాడు.

*డాక్టర్ విశ్వం — చెన్నై*

** పూర్వం పంచాగాల రచనకు మూలం ఏమిటి?*

'సూర్య సిద్ధాంతం' పంచాంగ రచనకు మూలమని 'మహా సిద్ధాంతం'లో ఆర్యభట్టు ఉవాచ!

*జేమ్స్ ఏసుపాదం — నెల్లూరు*

** వృక్ష వేధోదోషానికి నివారణ ఏమిటి?*

ఒక చెట్టును తీసివేస్తే పది చెట్లు నాటి పోషించడం, దేవుడి గదిలో 'కుబేర యంత్ర' ప్రతిష్ట నివారణోపాయాలు.

*ఎన్.పవిత్ర — నెల్లూరు*

** కత్తెర, మూఢం రోజుల్లో ముహూర్తాలు, శుభ కార్యక్రమాలు ఉంటాయా?*

కర్తరి, మౌఢ్యం రోజులు ముహూర్తాలు, శుభ కార్యక్రమాలకు నిషిద్ధం.

*డాక్టర్ జరీనాబేగం — హైదరాబాద్*

** ఝాములు(రోజుకు) ఎన్ని. వాటి సమయం ఎంత?*

రోజుకు ఎనిమిది ఝాములని 'బ్రహ్మ సిద్ధాంతం'లో బ్రహ్మగుప్తుడి అభిప్రాయం. ఝాముకు మూడు గంటల సమయం.

*సి.శశికళారెడ్డి — సికింద్రాబాద్*

** మంచి రోజులు కాని రోజుల్లో కూడా ముహూర్తాలు పెడుతున్నారు.*

రోజులకూ, మంచి ముహూర్తాలకు, అమృత ఘడియలకూ సంబంధమే లేదు. నవమి, రేవతి నక్షత్రం; చతుర్దశి, ఆర్ద్ర నక్షత్రం; చవితి, పుబ్బ నక్షత్ర సమయంలో కొన్ని కార్యక్రమాలు చెయ్యవచ్చు.

*ఎం.అనంతాచార్యులు — ఆత్మకూరు*

** శత్రుస్థానంలో శని, రాహు, కేతు, కుజులు ఉన్నప్పుడు పరిష్కార మార్గాలేమిటి?*

శని, ఇతర శత్రు గ్రహాలు వ్యతిరేకత చూపుతున్నప్పుడు ఆయా వ్యక్తులు రత్నధారణ చేయాలి. గృహానికి దంపతుల నక్షత్ర బలాలనుబట్టి యంత్ర ప్రతిష్టలు చేయించాలి.

*జాన్సన్ హరిప్రియ — సికింద్రాబాద్*

** జీవితంపై వాస్తు ఒక్కటే ప్రభావం చూపిస్తుందా?*

వాస్తు, జ్యోతిషాలు సగభాగం, విధి లిఖితం సగ భాగం మనుషులపై ప్రభావం చూపిస్తాయి.

*డాక్టర్ భరద్వాజ — చెన్నై*

** మీపై అతనికున్న నమ్మకానికి ఆశ్చర్యం వేసింది. యంత్రం, రాయి వేసుకున్నాక అతనికి పూర్తి స్వస్థత చేకూరింది.*

రోగికి నమ్మకాన్ని మించిన 'వైద్యం' లేదని మీకూ తెలుసు. నమ్మకం యంత్రమో, రాయో ఏదైనా కావచ్చు. అతను స్వస్థత పొందాడు. సైన్సుకు అర్థంకాని ఇలాంటి విషయాలనే "అతీత ఆధ్యాత్మిక శక్తి చేతనలని" స్వామి వివేకానంద "మైండ్ అండ్ అస్టోనిష్డ్ థింగ్స్" అనే పుస్తకంలో పేర్కొన్నారు.

*కె.వసుధానాయుడు — గూడూరు*

** రాహుకాలం, యమగండం తదితర చెడు కాలాల్లో ఏది పాటించాలి?*

ఒక్కో స్థితిలో ఒక్కోదాన్ని చూడాలి. మొత్తం మీద 'రాహుకాలం' ఒక్కటే చూసుకొంటే సరిపోతుంది.

# జననీ సురక్ష యోజన పథకం అమలు కాదేమీ?

జిల్లాలో జననీ సురక్ష యోజన పథకం సక్రమంగా అమలు జరగడం లేదు. ఈ పథకం క్రింద అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో కాన్పులు చేయాల్సి ఉంటుంది. ఆరోగ్య కేంద్రాలలో తగిన వసతులు లేవన్నది కారణంగా చూపుతున్నారు. కానీ అన్ని వసతులున్న ఆసుపత్రులలో కూడా కాన్పులు సరిగా చేయడం లేదన్నది ప్రజల అభిప్రాయం. జిల్లా వైద్య ఆరోగ్య శాఖ ప్రతినెల నిర్వహించే సమీక్షా సమావేశంలో ప్రభుత్వ ఆసుపత్రులలో కాన్పులు తగ్గుముఖం పట్టడంపై చర్చ జరుగుతున్నా అధిగమించేందుకు వైద్యులు ప్రయత్నం చేయడం లేదు.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల పరిధిలో వున్న గ్రామాల్లో సంబంధిత ఆరోగ్య సిబ్బంది పర్యటించి ఆరోగ్య సూత్రాలను ప్రచారం చేయాల్సి ఉంటుంది. అంతేకాకుండా గర్భిణులకు నెలలు నిండిన తర్వాత సమీపంలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో కాన్పు జరగాలి. ఇందుకు ఆయా గ్రామాలకు నియమించిన ఎఎన్‌ఎం, సూపర్‌వైజర్లు కృషి చేయాల్సి ఉంది. వైద్య సిబ్బంది వారికి కేటాయించిన సమయంలో గ్రామాల్లో పర్యటించడం లేదు. వారానికో, పది రోజులకో ఒకసారి చుట్టపు చూపుగా గ్రామాలకు వెళ్లి వస్తున్నారు. గ్రామంలో ఎంతమంది గర్భిణులున్నారు, వారికి అందిస్తున్న వైద్య సేవలు ఏమిటి అన్నదానిపై పర్యవేక్షణ చేసేవారు లేకుండా పోయారు.

నెలలు నిండిన తర్వాత కాన్పు కోసం సమీపంలో ఉన్న ఆరోగ్య కేంద్రానికి వెళితే కాన్పు చేసేందుకు సిబ్బంది నిరాకరిస్తున్నారు. అవసరమైన సదుపాయాలు కొరతగా ఉందన్న కారణం చూపి ప్రైవేటు ఆస్పత్రులకు వెళ్లాలని సలహా ఇస్తున్నారు. మరికొన్ని ఆరోగ్య కేంద్రాలలో వైద్యులు అందుబాటులో ఉండకపోవడంతో గర్భిణులను చేర్చుకునేందుకు నిరాకరించిన సంఘటనలు ఉన్నాయి. జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ ద్వారా ఆరోగ్య కేంద్రాలలో వసతుల ఏర్పాటు కోసం వైద్య ఆరోగ్య శాఖ నిధులు విడుదల చేస్తుంది. ఈ నిధులతో అవసరమైన సదుపాయాలు సమకూర్చుకోవాల్సిన వైద్యులు ఇతర అవసరాలకు వినియోగిస్తున్నారన్న ఆరోపణలు ఉన్నాయి. దీంతో రోగులకు వైద్య సేవలు అందకుండా పోవడమే కాకుండా ప్రైవేటు ఆస్పత్రులలో వేలాది రూపాయలు వెచ్చించాల్సిన దుస్థితి ఏర్పడుతుంది.

**ఈ పథకం క్రింద అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో కాన్పులు చేయాలి. ఆరోగ్య కేంద్రాలలో తగిన వసతులు లేవని వీటిని దాటవేస్తున్నా ప్రశ్నించే అధికారులు లేకుండా పోయారు.**

ప్రభుత్వ ఆస్పత్రులలో కాన్పు జరిగితే బాధితులకు పారితోషికంగా 1400 రూపాయలు ప్రభుత్వం అందిస్తుంది. ఈ నగదుతో పౌష్టికాహారం తీసుకొనే వీలుంటుంది. వైద్యసేవలు, సదుపాయాల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రతి సంవత్సరం కోట్ల రూపాయలు కేటాయించి ఖర్చు చేస్తున్నా వైద్యసేవలు నామమాత్రంగానే అందుతున్నాయి. ఫలితంగా ప్రభుత్వ లక్ష్యం నెరవేరకుండా పోతుంది. గతంలో ఏర్పాటుచేసిన 30 పడకల ఆస్పత్రుల్లో తప్ప మిగతా ఆస్పత్రులలో కాన్పులు జరగడం లేదు. జిల్లాలో క్లస్టర్ల ఏర్పాటు విధానం కారణంగా వైద్యసేవలు అందకుండా పోయాయని కొందరు వైద్యులు వ్యాఖ్యానిస్తున్నారు. ఒక్కో మండలానికి కమ్యూనిటీ హెల్తు సెంటర్‌ను ఏర్పాటు చేసింది ప్రభుత్వం.

ఈ హెల్త్ సెంటర్‌లో ఒక గైనకాలజిస్ట్, చిన్నపిల్లల వైద్యులు, మత్తు వైద్యులతోపాటు ఇద్దరు మహిళా వైద్యులు, ఒక పురుష వైద్యుడి నియామకం జరగాలి. అయితే కొన్ని కేంద్రాలలో పూర్తిస్థాయి వైద్యులు, సిబ్బంది లేరు. దీంతో హెల్త్ సెంటర్‌కు కేటాయించిన లక్ష్యాలు నెరవేరడం కష్టతరంగా మారిందని ప్రభుత్వ వైద్యులు అంటున్నారు. పూర్తిస్థాయి సిబ్బంది లేకుండా కాన్పులు, కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలు ఎలా చేయాలని ప్రశ్నిస్తున్నారు. ప్రభుత్వం క్లస్టర్లను ఏర్పాటు చేసిందే తప్ప అవసరమైన సిబ్బంది, నిధులు వీటికి కేటాయించలేక పోయిందన్న అభిప్రాయం వ్యక్తమవుతుంది. గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలకు వైద్యసేవలు అందించేందుకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సిబ్బంది కృషి చేయాలంటున్నారు.

జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిగా బాధ్యతలు చేపట్టిన డాక్టర్ మాశిలామణి జిల్లావ్యాప్తంగా పర్యటిస్తూ ఆకస్మిక తనిఖీలు చేస్తున్నారు. ఈ తనిఖీల్లో రోగులకు సరైన వైద్యసేవలు అందడంలేదన్న విషయం బహిర్గతమైంది. విధులు సక్రమంగా నిర్వహించని సిబ్బందిపై చర్యలు తీసుకోవడంతోపాటు ప్రభుత్వ వైద్యశాలలో కాన్పులు జరిగే విధంగా కృషి చేయాల్సిన అవసరం ఉంది.

ఆటోనగర్‌లో రీ సైక్లింగ్

• నెల్లూరు ఆటోనగర్‌లో

# కిరోసిన్, ఇంజన్ ఆయిల్ రీసైక్లింగ్!

**గుర్తింపు వుండే ఆటోమొబైల్ కంపెనీలకు పౌరసరఫరాల శాఖ నుంచి సరఫరా అవుతున్న తెల్ల కిరోసిన్‌ను ఎవరికీ అనుమానం కలుగకుండా కొన్ని రసాయనాలు కలిపి రీ సైక్లింగ్ చేసి బహిరంగ మార్కెట్‌లో అమ్మేస్తున్నారు.**

నెల్లూరు నగరంలో తెల్లకిరోసిన్, ఇంజన్ ఆయిల్ రీసైక్లింగ్ జోరుగా సాగుతోంది. ఇందుకు ఆటోనగర్‌ను కేంద్రంగా చేసుకుని కొందరు వ్యాపారులు బహిరంగంగానే విక్రయాలు జరుపుతున్నారు. తక్కువ పెట్టుబడి పెట్టి అధిక మొత్తంలో లాభాలు గడిస్తున్నారు. ఈ వ్యాపారం గురించి సంబంధితశాఖ అధికారులకు సమాచారం వున్నప్పటికి నియంత్రించేందుకు ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. ఆటోమొబైల్ వ్యాపారానికి కేంద్రబిందువుగా వున్న ఆటోనగర్‌లో కొంతకాలం నుంచి రీసైక్లింగ్ చేస్తున్నారు. ఇంజన్ పరికరాలను శుభ్రం చేసిన అనంతరం తీసి వేసిన తెల్లకిరోసిన్ రీసైక్లింగ్ చేసి బయట మార్కెట్లో విక్రయాలు జరుపుతున్నారు.

జిల్లాలో గుర్తింపు కలిగిన ఆటోమొబైల్ కంపెనీలకు పౌరసరఫరాలశాఖ నుంచి తెల్లకిరోసిన్ సరఫరా అవుతుంది. ఈ కిరోసిన్‌తో పరికరాలను శుభ్రం చేసిన అనంతరం లీటర్ 5రూపాయల వంతున కొనుగోలు చేసి ప్రత్యేక యంత్రాలను ఉపయోగించి రీసైక్లింగ్ చేసి లీటర్ 20రూపాయల వంతున విక్రయిస్తున్నారు. ఒకసారి వినియోగించిన దానిని ఇతర అవసరాలకు ఎట్టిపరిస్థితులలో వాడకూడదు. ఆటోనగర్ నుంచి రీసైక్లింగ్ చేసిన కిరోసిన్‌ను తీసుకెళ్లి డీజిల్, పెట్రోల్‌లో కల్తీ చేస్తున్నారు. కల్తీ చేసిన ఇంధనాన్ని వినియోగించిన వాహనాలు తక్కువ కాలంలోనే మరమ్మత్తులకు గురవుతున్నాయి. ఎక్కువ మొత్తంలో కొనుగోలు చేస్తే లీటర్ 15రూపాయలకే అందజేస్తున్నారు.

పౌరసరఫరాల శాఖ అనుమతితో ఆటోమొబైల్ కంపెనీలకు ప్రతినెల పదివేల లీటర్ల వంతున తెల్లకిరోసిన్ సరఫరా చేస్తున్నారు. ఎవరికీ అనుమానం కలగకుండా వుండే విధంగా కొన్ని రసాయనాలను రీసైక్లింగ్ చేసిన అనంతరం కలుపుతున్నారు. సాధారణ కిరోసిన్‌కు ఏమాత్రం తీసిపోని విధంగా రంగు వుండడంతో దీనిని నకిలీదని గుర్తించడం కష్టంగా వుంటుంది. తెల్లకిరోసిన్‌ను సరఫరా చేస్తున్న అధికారులు వినియోగించిన అనంతరం దీనిని ఏం చేస్తున్నారన్న దానిపై పర్యవేక్షణ చేయడం లేదు. అధికారుల పర్యవేక్షణ, తనిఖీలు లేకపోవడంతో రీసైక్లింగ్ చేసే వ్యాపారులకు అడ్డు, అదుపు లేకుండా పోయింది. ఈ వ్యాపారం లాభసాటిగా వుండడంతో రెండు, మూడు ప్రాంతాల్లో రీసైక్లింగ్ కేంద్రాలు ఏర్పాటై వున్నాయి.

### ఇంజన్ ఆయిల్

వాహనాల నుంచి తీసివేసిన ఇంజన్‌ఆయిల్‌ను సైతం రీసైక్లింగ్ చేస్తున్నారు. పూర్తిగా నలుపురంగుకు మారిన ఆయిల్ కాకుండా కొంత ఎరుపు రంగుగా వుండే ఆయిల్‌ను ఇందుకు ఉపయోగిస్తున్నారు. ఆటోనగర్‌లో కొందరు తీసివేసిన ఇంజన్ ఆయిల్‌ను ప్రత్యేక పరికరాల ద్వారా వేడి చేసి ఒరిజినల్ ఇంజన్ ఆయిల్‌ను తలపించే విధంగా తయారు చేస్తున్నారు. ఇలా తయారు చేసిన దాన్ని నగరంలోని వివిధ షాపుల్లో విక్రయిస్తున్నారు. సాధారణంగా వీడాల్, క్యాస్ట్రాల్, హీరోహోండా కంపెనీలకు చెందిన ఇంజన్ ఆయిల్ సీలు వేసిన క్యాన్లలో విక్రయిస్తుంటారు. అయితే ఆటోనగర్‌లో తీసివేసిన దానిని రీసైక్లింగ్ చేసి విడిగా విక్రయాలు జరుపుతున్నారు. విడిగా విక్రయాలు జరపడంపై గతంలో పలు ఇంజన్ ఆయిల్ కంపెనీల ప్రతినిధులు పోలీసులకు ఫిర్యాదు చేసిన సందర్భాలున్నాయి. ఇలా చేయడం నేరమైనప్పటికి ఎవరు పట్టించుకోకపోవడంతో ఇది జోరుగా సాగుతోంది.

విడిగా దొరికే ఆయిల్‌ను సైతం కొందరు వ్యాపారులు క్యాన్లలో నింపి కంపెనీ ధర కంటే కొంతమేర తగ్గించి విక్రయిస్తున్నారు. దీనిని వినియోగించిన వాహనాల ఇంజన్ కొద్ది రోజులకే సీజ్ అవుతుంది. ప్రతి సంవత్సరం ఈ వ్యాపారం నిర్వహించే వారు దాదాపు పదిలక్షల మేర ఆదాయం గడిస్తున్నారు. ఇప్పటికైనా సంబంధితశాఖ అధికారులు స్పందించి చట్టవిరుద్ధంగా జరుగుతున్న రీసైక్లింగ్ వ్యాపారాన్ని అడ్డుకోవాల్సిన అవసరం వుంది.

## విద్యాబాలన్‌కు ఖరీదైన కానుక!

2011 హీరోయిన్ విద్యా బాలన్‌కు బాగా కలిసొచ్చింది. ఆమె నటించిన 'డర్టీ పిక్చర్' బాక్సాఫీసు దగ్గర వసూళ్ల వర్షం కురిపించింది. దీంతో ఆమె తన పారితోషికం కూడా పెంచేసింది. యూ టీవీ సిఇఓ సిద్దార్థ్‌రాయ్ కపూర్ – విద్యా బాలన్ చాలాకాలం నుంచి ప్రేమించుకొంటున్నారు. సిద్దార్థ్ ముంబైలో ఓ ఫ్లాట్ కొన్నాడు. దాని ఖరీదు అక్షరాల 14కోట్ల రూపాయలు. దీనికి పరిణీత అని పేరు కూడా పెట్టాడు. పరిణీత విద్యాబాలన్‌కు పేరు తీసుకొచ్చిన చిత్రం. అంతేకాదు... ఈ ఫ్లాట్‌ని విద్యకు బహుమతిగా ఇవ్వాలని నిర్ణయించుకొన్నాడు. ఈ ఫ్లాట్‌లోనే విద్య గృహప్రవేశం చేయబోతోంది. ఇంతకీ ఈ ప్రేయసీ ప్రియుల పెళ్లెప్పుడో?

## ప్రత్యేక పాత్రల్లో శ్రీకాంత్!

చిరంజీవి, నాగార్జున, వెంకటేష్ చిత్రాల్లో నటించాను బాలకృష్ణతో అవకాశం రాలేదు అనుకొనేవాణ్ని. శ్రీరామరాజ్యంతో ఆ కొరత తీరిందన్నాడు హీరో శ్రీకాంత్. ఆయన ఈ చిత్రంలో లక్ష్మణుని పాత్ర పోషించాడు. ఇతర కథానాయకుల చిత్రాల్లోనూ ఎలాంటి భేషజాలు లేకుండా ముఖ్యపాత్రలు పోషించడం శ్రీకాంత్ శైలి. ఇప్పుడు మరో రెండు భారీ చిత్రాల్లో నటించేందుకు అంగీకరించారాయన. వెంకటేష్ కథానాయకుడిగా మెహర్ రమేష్ దర్శకత్వంలో ఓ చిత్రం రూపొందబోతోంది. ఇందులో కీలక పాత్ర శ్రీకాంత్‌ను వరించింది. అలాగే నాగార్జున నటించే 'షిరిడి సాయి' చిత్రంలో రాజు పాత్ర పోషించను శ్రీకాంత్ అంగీకరించాడు.

## మరపురాని ప్రియులు

బంధాలు తెగిపోయినప్పుడు బాధగానే వుంటుంది. కానీ అలాంటి సమయంలో ఆ బాధను పంచుకునే వారుంటే ఊరట కలుగుతుంది. జాన్ అబ్రహంతో విడిపోయాక మనసు ఆందోళనలో పడింది. ఆ సమయంలో నా కుటుంబ సభ్యులు ఇచ్చిన సహకారం వల్ల తొందరగా తేరుకోగలిగానంటుంది బెంగాలీ భామ బిపాస బసు. జాన్‌అబ్రహంతో పది సంవత్సరాలుగా సాగిన ప్రేమాయణం ఎందుకు విఫలమైందంటే ఇది పూర్తిగా వ్యక్తిగత విషయం. ఏదో ఒక్క కారణంతోనే బంధం తెగిపోదంది. మాజీ ప్రేమికులు మిలింద్, డినో, జోష్‌లతో సంబంధాన్ని కొనసాగిస్తారా అంటే కొన్ని బంధాలు తెగిపోవు. గతంలో మా మధ్య గుర్తుంచుకోదగ్గ అనుభూతులున్నాయి. వాటిని ఎలా మర్చిపోగలనంటుంది ఈ సుందరి.

## కష్టం తెలిసొచ్చింది!

ఈ యేడాది హీరోయిన్ సమంత చేతిలో ఐదు చిత్రాలున్నాయి. ఆటోనగర్ సూర్య షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ చెన్నైలో స్టెల్లా మేరీ కాలేజిలో చదివిన రోజుల్లో స్నేహితులతో కలిసి సినీతారలకు ఏం కష్టం అని మాట్లాడుకొనేవాళ్లం. ఇప్పుడు తెలుస్తోంది నటులెంత కష్టపడాలో? తెర మీద ప్రేక్షకులు చూసే ప్రతి సన్నివేశం వెనుక బోలెడంత శ్రమ వుంటుంది. చిత్రసీమలో నేను ప్రతిక్షణాన్ని ఆస్వాదిస్తున్నాను. నేను నటించిన చిత్రాలన్నీ విజయవంతం కావడం అవార్డులు, రివార్డులు రావడం కూడా సంతోషంగా వుందంటుంది సమంత.

## మల్లికనా.. మజాకా?

కొత్త సంవత్సర వేడుకల్లో తారలు ఆడి పాడడం, లక్షలు వసూలు చేయడం కొత్తేంకాదు. ఇటువంటి వేడుకల్లో మల్లికా షెరావత్ హవా ఇంకా నడుస్తూనే వుంది. కొత్త సంవత్సరం స్వాగత సంబరాల్లో పాల్గొన్నందుకు ఆమె భారీ మొత్తంలో పారితోషికం అందుకొంది. ముంబైలోని తులిప్ అనే స్టార్ హోటల్‌లో డిసెంబర్ 31తేదీన మల్లిక నృత్య ప్రదర్శనలో పాల్గొంది. నిమిషానికి 4లక్షల చొప్పున ఆ నృత్యం పూర్తయ్యేసరికి 60లక్షల రూపాయలు వసూలు చేసిందట. మేకప్, కాస్ట్యూమ్స్ కోసం 2లక్షల వరకు ఖర్చు పెట్టిందట. ఇలాంటి వేడుక నెలకు ఒకటి తగిలితే చాలంటున్నారు సహనటీమణులు.

## సంతోషంగా ఉంది!

రాజన్న చిత్రంలో మల్లమ్మ పాత్రపోషణ ద్వారా ఎంతో పేరు తెచ్చుకొంది బాలనటి బేబి అని. ఈ పాప మూడేళ్ల ప్రాయం నుంచి తెరపై కనిపిస్తూ 25 సినిమాల్లో నటించినా రాజన్న చిత్రం మాత్రం ఆమెకు బ్రేక్ నిచ్చింది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ రాజన్నలో నేను బాగా నటించానని అందరూ మెచ్చుకొంటున్నారు. నాగార్జున అంకుల్‌తో కలిసి నటించడాన్ని మరవలేను. దర్శకులు విజయేంద్ర ప్రసాద్, రాజమౌళి అంకుల్ ప్రతి విషయాన్ని విడమర్చి చెప్పి నా నుంచి మంచి నటన రాబట్టుకొన్నారు. బాగా నటించానని రోజూ చాక్లెట్లు ఇచ్చేవారు. మల్లమ్మ పాత్ర ఎంతో ఇష్టంగా చేయబట్టే అందరూ మెచ్చుకొంటున్నారన్నది ఈ చిన్నారి.

## అతను స్నేహితుడు...

లీడర్‌లో తెరంగేట్రం చేసిన రిచా గంగోపాధ్యాయ ఎక్కువగా తమిళ చిత్రాల్లో నటిస్తోంది. చెన్నైలో ఆమెపై వార్తలు గుప్పుమంటున్నాయి. సుందర్‌రామ్ అనే నటుడితో ఆమె సన్నిహితంగా వుంటోంది. రిచా బస చేసే ఓ స్టార్ హోటల్‌లో సిబ్బంది సుందర్‌ని అడ్డుకోవడంతో చిన్నపాటి ఘర్షణ కూడా చోటు చేసుకొందని వార్తలొచ్చాయి. అయితే ఈ విషయాన్ని రిచా ఖండించింది. సుందర్ కేవలం స్నేహితుడు మాత్రమే. మైకంఎన్న చిత్రంలో ఇద్దరం కలిసి నటించాం. అంతే తప్ప మరేం లేదు. లేనిపోని పుకార్లతో ఇబ్బంది పెట్టవద్దంటుంది.

## హాట్ కత్రినా!

సెక్సీ హీరోయిన్‌గా పలు సర్వేల్లో అగ్రస్థానంలో నిలిచిన నాయిక కత్రినా కైఫ్. ఇటీవల నెట్‌లో ఎక్కువమంది సెర్చ్ చేసే సెలబ్రిటీ ఎవరని సర్వే నిర్వహిస్తే కత్రినాయే ముందు నిలబడింది. ఇటీవల కత్రినా ఫోటోలు, వీడియోలు ఎక్కువగా తిలకిస్తున్నారు. కరణ్ జోహార్ నిర్మిస్తున్న హిందీ చిత్రం అగ్నిపథ్‌లో హృతిక్ రోషన్, సంజయ్ దత్ ప్రధాన పాత్రధారులు. ఇందులో 'చిక్నీ ఛమేలి' అనే ప్రత్యేక గీతం వుంది. ఈ పాటకు కత్రినా నృత్యం చేసింది. అందులో ఆమె నృత్య భంగిమలు హుషారుగా వున్నాయి. ఇంతవేగంగా కత్రినా నృత్యం చేస్తుందని ఎవరూ ఊహించరు. ఆమె స్టెప్స్ ప్రతి ఒక్కరినీ హుషారెత్తిస్తాయంటున్నాడు ఈ చిత్ర దర్శకుడు.

## మళ్లీ సీతగా చేయను

శ్రీరామరాజ్యం చిత్రంలో సీతగా నయనతార హావభావాలు ప్రేక్షకులను మంత్రముగ్దులను చేశాయి. భవిష్యత్తులో పౌరాణిక సినిమాలు రూపొందిస్తే కథానాయిక పాత్రకు భరోసా లభించినట్లైంది. మళ్లీ సీత పాత్రలో నటిస్తారా? అని దర్శక నిర్మాతలు నయనతారతో సంప్రదింపులు మొదలెట్టారు. ఈ జాబితాలో రాంగోపాల్ వర్మ కూడా వున్నాడట. అయితే నయన అందుకు సుముఖంగా లేదు. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ శ్రీరామరాజ్యం చిత్రంలో సీత పాత్ర నా కెరీర్‌లో నాకు లభించిన అరుదైన అవకాశం. బాపు ఇచ్చిన సహకారంతో ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నాను. ఇలాంటి పాత్రల్లో ఒక్కసారే నటించాలి. మళ్లీ మళ్లీ చేయకూడదు. అందుకే మరోసారి సీత పాత్ర పోషించే అవకాశం వచ్చినా ఒప్పుకోనంది.

# వివేకా... టౌన్‌బస్సుల యాజమాన్యం మధ్య రగడ!



పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో సీజ్‌చేసి పెట్టిన టౌన్ బస్సులు.

## ● నలిగిపోతున్న సామాన్య జనం

ఒకవైపు అధికార బలం, మరోవైపు ఆధిపత్య ధోరణి కలగలిపి నగరవాసుల రవాణా సౌకర్యం పాలిట శాపంగా పరిణమించాయి. దీనికి సంబంధించిన వివరాలిలా వున్నాయి. సహజంగా రాజకీయపార్టీలు నిర్వహించే కార్యక్రమాలకు, ఆందోళనలు, బహిరంగ సభలకు ప్రైవేటు బస్సులను పెట్టి జనసమీకరణ చేస్తుంటారు. ఏ పార్టీ వారు అడిగినా బస్సుల యాజమాన్యాలు బస్సులను పంపిస్తుంటాయి. ఇటీవల వైఎస్ ఆర్ కాంగ్రెస్‌పార్టీ జరిపిన ఫీజు పోరు కార్యక్రమానికి నగరంలో కోమిట్ల బస్సు యాజమాన్యం బస్సులను పంపింది. ఈ విషయం తెలుసుకొన్న రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు. తనను ధిక్కరించి బస్సులను ఆ పార్టీ కార్యక్రమానికి పంపుతారా అని హుంకరించి తన అధికార బలాన్ని ప్రదర్శించాడు. రవాణాశాఖ అధికారులకు ఫోన్‌చేసి ఆ బస్సులపై రైడ్‌చేసి సీజ్ చేయమని ఆదేశించాడట. ఇంకేముంది నేతల మోచేతి నీళ్ల త్రాగే అధికారులు ఆనం ఆజ్ఞ ఇచ్చిందే తడవుగా ఆగమేఘాలపై బస్సులను తనిఖీచేసి కొన్నింటిని సీజ్ చేశారు. ఇది ముమ్మాటికీ తప్పే. ప్రతిపక్ష పార్టీల కార్యక్రమాలకు బస్సులు పంపవద్దని చెప్పే అధికారం వీరికెవరిచ్చారు. దీనిపై బస్సుల యాజమాన్యం ఇంకో రకంగా స్పందించాల్సింది పోయి మిగిలిన బస్సులను నడపడం మానేశారు. గత కొన్నేళ్లుగా నగరంలో వివిధ ప్రాంతాలలో తిరిగే 74బస్సులు కోమిట్ల సంస్థ క్రిందే నడుస్తున్నాయి. ఒక రకంగా చెప్పాలంటే ఏకచత్రాధిపత్యం. ఆ బిర్రుతో బస్సులను నడపకుండా వుండటం ధిక్కారం క్రిందే లెక్క. ప్రయాణీకులను ఇబ్బంది పెట్టే అధికారం, హక్కు ఈ బస్సుల యాజమానులకు ఎక్కడిది? అధికారుల దాడులు చేస్తే డ్రైవర్లు విధిగా లైసెన్సులు కలిగి వుండేలా చూసుకోవాలి. అలాంటి వారినే డ్రైవర్లుగా పెట్టుకోవాలి. అవేమీ పట్టించుకోకుండా ఎవరిని పడితే వారిని డ్రైవర్లుగా పెట్టుకొని, బస్సులు డబ్బారేకుల మాదిరిగా తయారైనా, అధికంగా కాలుష్యం వెదజల్లుతున్నా పట్టించుకోకపోవడం అధికారులకు లంచాల సొమ్ము విధిలిస్తున్నాములే తమనెవరు ఏమి చేయలేరన్న ధిక్కార ధోరణిలో నడుస్తుంది. నేతలు, అధికారులు, బస్సు యాజమాన్యాల పంతాలకు చివరకు ఇబ్బందులు పడుతున్నది నగర వాసులు. టౌన్‌బస్సులు తిరగకుండా ఆగిపోయి జనం తిప్పలు పడుతున్న ఏ అధికారి ఆ సమస్య గురించి పట్టించుకోకపోవడం మరింత ఆశ్చర్యంగొల్పుతోంది.

● ఫీజు బకాయిలపై

# కదంతొక్కిన విద్యార్థులు!

## ● ఆవేశం అందిపుచ్చుకొన్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ



కలక్టరేట్ వద్ద బారులు తీరిన విద్యార్థినులు.

ఫీజు బకాయిలు విడుదల చేయడంలో ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని ఎండగడుతూ వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ చేపట్టిన ఫీజు పోరులో విద్యార్థులు కదంతొక్కారు. ఇటీవల కలెక్టర్ కార్యాలయం వద్ద ఆ పార్టీ ఆందోళన చేపట్టింది. జిల్లా నలుమూలల నుంచి పెద్ద సంఖ్యలో విద్యార్థులు హాజరై తమ నిరసనను ప్రభుత్వానికి తెలియజెప్పారు. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన రెడ్డి, ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి తదితరులు ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించి ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని ఎండగట్టారు. పేదరికం చదువుకొనేందుకు ప్రతిబంధకం కాకూడదన్న ఉద్దేశంతో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఫీజు రీఎంబర్స్‌మెంట్ పథకాన్ని ప్రారంభించారన్నారు. దీని వల్ల ఎందరో పేద విద్యార్థులు ఇంజనీరింగ్, డాక్టరు తదితర ఉన్నత విద్యను చదవగలిగారన్నారు. కానీ నేటి పాలకులు వైఎస్ చేపట్టిన ఈ పథకాన్ని నీరుగార్చేందుకు ప్రయత్నిస్తున్నారని ఆరోపించారు. రాష్ట్రవ్యాప్తంగా కేవలం 300కోట్లు మాత్రమే విడుదల చేశారు. దీనిని బట్టి ప్రభుత్వ తీరు అర్థం చేసుకోవచ్చున్నారు. జిల్లాలో కోట్లాది రూపాయలు బకాయిలు వున్నాయన్నారు. ఫీజు రీఎంబర్స్‌మెంట్ నిధులు విడుదల చేయకపోవడంతో కళాశాలల యాజమాన్యాలు విద్యార్థులను ఫీజు బకాయిలు చెల్లించమని ఒత్తిడి చేస్తుండడంతో దిక్కుతోచని స్థితిలో విద్యార్థులున్నారన్నారు. మరో మూడు నెలల్లో పరీక్షలు వున్నందున వారి అవస్థ వర్ణనాతీతమన్నారు. తక్షణం బకాయిలు విడుదలచేసి విద్యార్థులను ఆదుకోవాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో పార్టీ నేతలు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## అన్నీ అనుమానాలే

మొదటి పేజీ కొరవ

అంత పసి వయస్సులో బాత్‌రూంలో కాలు జారి పడడం, చనిపోయేంత ప్రమాదం జరగడం అసంభవం. ఉరి పోసుకొని ఆత్మహత్య చేసుకోవడం నిజమైతే, ఆ సూచనలు శవంలో లేవని చూసినవారు చెప్తున్నారు. పైగా మెడ మీద పెద్ద గాయం కన్పించింది. ఉరి పోసుకొంటే నాలుక బయటకు రావడం, గొంతు మొత్తం నలిగిపోవడం, రక్తం కమిలిన గుర్తులు ఏర్పడడం వంటివి జరుగుతాయే తప్ప, మెడ మీద గాయం పడదు. అసలు పెళ్లయిన రెండు నెలలకు, అదీ కన్న వారున్న ఇంట్లో ఆత్మహత్య చేసుకోవాల్సిన అగత్యం ఎందుకు ఏర్పడుతుంది? ఒక వేళ ఆత్మహత్యే అనుకొంటే, స్థానిక పోలీసుకు సమాచారం ఇవ్వకుండా శవాన్ని తరలించడం సరైన పద్ధతి కాదు.

మాకు తెలిసిన సమాచారం మేరకు, 14తేది రాత్రే వెడిచర్లలోని ఆ యువతి అమ్మమ్మకు కబురు పంపారట, అర్జెంట్‌గా మద్రాసుకు రమ్మని. ఆమె ఇంటికి వెళ్లి చూసే సరికే, ఆ యువతి చనిపోయి వుంది. అరగంట క్రితమే ఈ దుర్ఘటన జరిగిందని చెప్పారట తల్లితండ్రులు. అరగంట క్రితం మరణిస్తే, ముందురోజు రాత్రి అమ్మమ్మకు పిలుపు ఎట్లా వెళ్తుంది? ఆమె వెళ్లింది 15తేది ఉదయం. కానీ శవాన్ని మాత్రం ఆ రోజు అర్ధరాత్రికి కానీ వెడిచెర్లకు చేర్చలేదు. అంత విరామం ఎందుకు?

అసలు ఆ యువతి శవానికి వెడిచర్లలో అంత్యక్రియలు చేయవలసిన అవసరం ఏమి వచ్చిందన్నది పెద్ద ప్రశ్న. ఆ యువతి చనిపోయింది మద్రాసు నగరంలో. అక్కడే అంత్యక్రియలు చేయవచ్చు. ఆమె స్వగ్రామం కురుగొండ. అక్కడకు తరలించవచ్చు. ఆమె భర్త, పశ్చిమగోదావరి జిల్లా ఏలూరుకు చెందినవాడు. ఆయన వూరికి పంపి వుండవచ్చు. కానీ ఏ సంబంధమూ లేని వెడిచర్లకు శవాన్ని తరలించి, అంత్యక్రియలు చేయించడంలోనే ఈ చావు వెనుక ఏదో తెలియని మిస్టరీ వుందన్న సందేహాన్ని కల్గిస్తున్నది. మరీ అనుమానించదగిన అంశం – ఆమె ఉత్తరక్రియలు నెల్లూరు నగరంలో జరిపించడం. వాటికి ఆమె భర్త కానీ ఆయన కుటుంబీకులు కానీ హాజరు కాకపోవడం. శవదహనం ఎక్కడ జరిగితే అక్కడ ఉత్తరక్రియలు చేయడం మన సాంప్రదాయం. అది కూడా పాటించలేదంటే, ఆమె కుటుంబీకులే ఏదో దాచి పెట్టడానికి ప్రయత్నిస్తున్నారని సులభంగా అర్థమైపోతున్నది. ఆ రహస్యం ఏమిటన్నది ప్రశ్న.

ఆ యువతి హత్యకు గురైందన్న సందేహం ప్రబలంగా విన్పిస్తున్నది. కన్నవారి ఇంట్లో హత్య అంటే నమ్మడం కష్టం. కానీ పరిస్థితులు అందుకు వూతం ఇస్తున్నాయి. అసలామె ఆ రోజు మద్రాసుకు ఎందుకు వచ్చింది? ఎప్పుడు వచ్చింది? ఎవరితో కలిసి వచ్చింది? ఈ దుర్ఘటన జరిగింది 14తేది రాత్రి ఆ ఇంట్లో ఎవరెవరు వున్నారు? కేవలం తల్లి తండ్రులు మాత్రమేనా లేక బయటి వ్యక్తులెవరైనా వున్నారా? వుంటే వారెవరు? ఎందుకు వున్నారు? వారికి, ఇంట్లోని వారికి మధ్య ఏదైనా ఘర్షణ జరిగిందా? ఇవన్నీ ప్రశ్నలే.

ఒక వదంతి ప్రకారం, ఆ రోజు రాత్రి ఆ యువతి మీద అత్యాచార ప్రయత్నం జరిగిందనే సందేహం వుంది. దాన్ని తప్పించుకొనే క్రమంలో ఆమె మరణించి వుండవచ్చని ఒక అనుమానం. అదే నిజమైతే ఆ దుర్మార్గానికి ఒడిగట్టిన వారెవరు? మరొక వదంతి – ఆ యువతి పేరుతో కొన్ని బినామీ ఆస్తులున్నాయని, వాటి విషయంలో జరిగిన ఘర్షణలోనే ఆమె మరణించి వుండవచ్చునని. ఇవి కేవలం వదంతులు మాత్రమే. ధృవపడిన వాస్తవాలు కావు. అయితే ఈ సందేహాలను నివృత్తి చేయవలసిన బాధ్యత పోలీసు మీద వుంది.

విచిత్రంగా, గూడూరు రూరల్ పోలీసు సిబ్బంది కొమ్మనేటూరు గ్రామం వెళ్లి విచారణ జరిపారని తెలుస్తున్నది. తమ గ్రామంలో గత మూడు నెలలుగా ఎటువంటి చావులూ లేవని గ్రామస్తుల నుంచి వాంగ్మూలం కూడా నమోదు చేసుకొని వచ్చారట. గతవారం 'జమీన్‌రైతు'లో కొమ్మనేటూరు గ్రామంలో అనుమానపు చావు అనే వార్తపై ఈ విచారణ జరిగిందేమో తెలియదు. అయితే మేము పొరపాటున కొమ్మనేటూరు గ్రామం పేరు వ్రాశాము. ఈ దుర్ఘటన జరిగింది ఆ పక్కనే వున్న వెడిచర్ల గ్రామంలో. అంత దూరం విచారణకు వెళ్లిన పోలీసుకు ఆ విషయం తెలియలేదా? లేక కావాలనే కొమ్మనేటూరుకు పరిమితమై వెనక్కు తిరిగి వచ్చేశారా అన్నది తెలియదు.

ఏది ఏమైనా, పోలీసు మరింత లోతుగా దర్యాప్తు జరపవలసిన దుర్ఘటన ఇది. శవ దహనం విషయంలో కుటుంబీకుల సందేహాస్పద వైఖరి చూసిన తర్వాత ఆ అవసరం ఎంతైనా వుందనిపిస్తున్నది. అందులోనూ ఈ చావు వెనుక లేదా దాని విషయంలో దాపరికం పాటించడం వెనుక రాజకీయ ప్రముఖుల ప్రమేయం వుందన్న వదంతులు వ్యాప్తిలోకి వచ్చాయి కాబట్టి, విచారణ జరపడం తప్పనిసరి. ఎస్పీగారు ఈ విషయంలో చొరవ చూపితే, దీనిపై తలెత్తిన సందేహాలన్నీ నివృత్తి అవుతాయి. ఏది ఏమైనా వున్నత చదువు చదివి, అంత కంటే విద్యాధికుడితో వివాహం చేసుకొన్న రెండు నెలల్లో ఒక యువతి జీవితం ఇంత అనుమానాస్పదంగా అంతం కావడం విషాదకరం.

## నపుంసకత్వం

5వ పేజీ కొరవ

నడుస్తుంటే చిన్నపాటి కదలిక కూడా లేదు. ఇప్పుడు కూడా ఆ చెరువులో కావేరి రియల్ ఎస్టేట్ అనే బోర్డు ఉంది. దాన్ని తొలగించడానికి ప్రయత్నం చేసిన ఆర్డీఓ గారిపై వివేకా దురుసుగా ప్రవర్తిస్తే ఒక్క ఉన్నతాధికారీ ఆమె రక్షణకు వెళ్లలేక పోయారు. ఇప్పుడు అడుగు ముందుకు వేయలేక పోతున్నారు.

మన జిల్లా అధికారుల నపుంసకత్వానికి మరొక తాజా నిదర్శనం నెల్లూరు టౌన్ నడిబొడ్డున రమేష్‌రెడ్డి నగర్‌లోని మునిసిపల్ నీళ్ల ట్యాంక్ స్థలం దురాక్రమణ. టౌన్ కూడలి కావడంతో ఇక్కడ స్థలం విలువ బంగారంతో పోటీ పడుతున్నది. అంత విలువైన స్థలం ఖాళీగా పడి ఉంటే వివేకానందరెడ్డికి మనసెట్లా ఒప్పుతుంది. దాని పక్కనే ఉన్న రవీంద్రభారతి అనే ఇంగ్లీష్ మీడియం పాఠశాల వారికి దాన్ని ధారాదత్తం చేసి పారేశాడు. వారు అదేదో తమ అబ్బ సొత్తైనట్లు చుట్టూ ప్రహరీ కట్టి దురాక్రమించారు. ఆ స్థలంపై గత దశాబ్ద కాలంగా ఎందరి కళ్లో ఉన్నాయి. ఫోర్జరీ పత్రాలు సృష్టించి, తప్పుడుతనంతో కోర్టు ఆదేశాలు తెచ్చి దాన్ని కబళించాలని చూశారు చాలా మంది. కానీ ఆ స్థలం అనుకొని కాపురం ఉంటున్న న్యాయవాది జెసిఎస్ అమర్‌నాథ్, విఆర్ ట్రేడ్ లింక్స్ అధినేత వి.రామారావు ఎప్పటి కప్పుడు ఆ ప్రయత్నాలకు అడ్డం వెళ్లి, దాన్ని కాపాడుతూ వచ్చారు. కానీ ఇప్పుడు ఏకంగా ఎమ్మెల్యే గారే దురాక్రమణదారు అవతారమెత్తడంతో వారు కూడా నిస్సహాయులై పోయారు.

రెండు రోజుల నుంచి ఆ స్థలంలో నిర్భయంగా నిర్మాణాలు జరిగి పోతున్నాయి. జెసిఎస్ అమర్‌నాథ్ ఆ దుర్మార్గాన్ని జాయింట్ కలెక్టర్‌కు, మునిసిపల్ కమిషనర్‌కు తెలిపాడట. వచ్చి ఆపమని కోరాడట. కానీ వారిద్దరూ ఆ ఛాయలకు కూడా రాలేదు. ఆ పొరపాటు పని చేస్తే వివేకా నోటి కంపు భరించడం కష్టమన్నది వారి భయం. మంత్రిగారి కన్నెర్రకు మల మల మాడి పోతున్నారు జిల్లా అధికారులు. వారి సర్వ అవయవాలూ చచ్చుపడి పోతున్నాయి.

ఏమిటీ అన్యాయం? ప్రజల ఆస్తులను కాపాడవలసిన అధికారులు నపుంసకుల వలె తయారుకావడం ఘోరమైన నేరం. ఈ పరిస్థితి వారికి సిగ్గెట్లా కల్గించడం లేదో తెలియడం లేదు. నెల్లూరు జిల్లాలో ఎటువంటి కలెక్టర్లు పని చేశారు? ఎంత గొప్ప పనులు చేశారు? ఎంత పేరు ప్రతిష్టలు తెచ్చుకొన్నారు? రాజకీయవాదుల దౌష్ట్యాన్ని కంటి చూపుతో నియంత్రించే వారు పాత కాలం కలెక్టర్లు. పిడతల రంగారెడ్డి రెవిన్యూ మంత్రిగా తన పట్ల చిన్న పాటి అమర్యాద చూపాడనే కినుకతో వింజమూరులో జరిగిన ఒక సభలో అదే రెవిన్యూ మంత్రి ఉన్న వేదిక మీద సిగరెట్ వెలిగించి పరువు తీశాడు ఆనాటి కలెక్టర్ శ్రావణ్‌కుమార్. శంకరన్ గారిని కలవాలంటే భయపడి చచ్చేవాడు ఎసి సుబ్బారెడ్డి. పార్థసారధి, ఎమ్.సాంబశివరావు, సుజాతారావు వంటి కలెక్టర్లు తమ తమ కాలంలో ఉండిన మంత్రులను ఒక ఆట ఆడించారు. రాష్ట్ర ప్రభుత్వ అస్థిత్వానికే ముప్పు తెచ్చే మద్య నిషేధ ఉద్యమాన్ని, నిరక్షరాస్యతా నిర్మూలన పథకాలను నిర్భయంగా ముందుండి నడిపించాడు కొప్పుల రాజు. ఇప్పటి మినీ బైపాస్ రోడ్‌లో మూడు హాళ్ల రోడ్‌లో వేలాది గుడిసెల తొలగింపులో ఆనాటి మంత్రులను, కమ్యూనిస్టులను ధైర్యంగా ఎదుర్కొన్నాడు డిఆర్‌ఓగా ఉండిన హెచ్.కె.బాబు. ఆ అధికారుల పేరు చెప్తే ఆనాటి రాజకీయవాదులకు ఒళ్లంతా చెమటలు పట్టేవి. ఇప్పుడు రాజకీయ వాదుల వాసన తగిలితే మూత్రంతో ప్యాంట్లు తడిచిపోతున్నాయి అధికారులకు. అధికారులలో ఇంత దిగజారుడు బాధాకరం.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### పూజల్లో నేతలు

కోవూరు నియోజకవర్గం నుంచి ఉప ఎన్నికల్లో పోటీచేస్తున్న నేతలంతా వరిగొండలోని చాముండేశ్వరీదేవి ఆలయం నుంచి ప్రచారం మొదలు పెడుతున్నారు. నల్లపురెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి ప్రథమంగా ఇక్కడ నుంచి ప్రచారం మొదలు పెట్టగా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఆయన్ను అనుసరించారు. కాంగ్రెస్ అభ్యర్థిని ప్రకటించిన వెంటనే ఆయనా ఇక్కడ నుంచి ప్రచారం మొదలుపెట్టక తప్పని పరిస్థితి నెలకొని ఉంది. చాముండేశ్వరి దేవి మహత్యం అటువంటిది మరి!

### వికాస్ స్కూల్‌లో సంక్రాంతి

బాలాజీనగర్ వికాస్ హైస్కూల్లో పిల్లలకు వినూత్నంగా సంక్రాంతి సంబరాలు నిర్వహించారు. గంగిరెద్దులు, గొబ్బెమ్మలు, హరిదాసుల వేషధారణతో పిల్లలు ఆకట్టుకొన్నారు. కనుమరుగౌతున్న సాంప్రదాయాలు, సంస్కృతులను పిల్లలకు తెలియజెప్పేందుకు ఈ కార్యక్రమాన్ని నిర్వహించినట్లు స్కూలు నిర్వాహకుడు ప్రతాప్‌రెడ్డి తెలిపారు. పిల్లలకు బాలాజీనగర్ సిఐ కోటారెడ్డి, లెక్చరర్ శ్రీనివాసరావులు బహుమతులను అందజేశారు.

### మద్యపాన ప్రియుల సంక్షేమ సంఘం

రాష్ట్రంలో ఆ మాటకొస్తే దేశంలో ఎక్కడాలేని విధంగా జిల్లాలో మద్యపాన ప్రియుల సంక్షేమ సంఘం ఏర్పాటయ్యింది. ఈనాడు దినపత్రిక మాజీ విలేకరి సిరాజ్ ఈ సంఘాన్ని నెలకొల్పి మద్యపాన ప్రియులకు మద్దతుగా నిలచారు. ఎమ్మార్పీ ధరలకే మద్యం అమ్మాలని, బార్‌లలో కనీస సదుపాయాలు కల్పించాలని, కల్తీ మద్యం అరికట్టాలని సంఘం డిమాండ్ చేసింది. కొత్తగా ఉంది కదూ ఈ సంఘం ఏర్పాటు.

### బాషామొహియిద్దీన్‌కు పదవి

కాంగ్రెస్ పార్టీలో చాలారోజులుగా పని చేస్తున్న బాషామొహిద్దీన్‌ను పార్టీ గుర్తించింది. ఆయన్ను జిల్లా మైనార్టీ కాంగ్రెస్ కమిటీ కోఆర్డినేటర్‌గా నియమించింది. విజయనగరం జిల్లా మైనార్టీ కాంగ్రెస్ ఇన్‌ఛార్జ్‌గా కూడా నియమించింది. ఒకేసారి రెండు బాధ్యతలతో బాషాసాహెబ్ ఆనందానికి అవధులు లేవు.

## జనవాణి

2వ పేజీ కొరవ

సాహిత్యరంగాల్లో లబ్ధప్రతిష్టులైన మేధావులకు ఇస్తున్నారు. ఇప్పటికైనా క్రీడా రంగంలోని వారికి ఇవ్వాలన్న నిర్ణయం అభినందనీయం. హాకీ ఆటలో ధ్యాన్‌చంద్, క్రికెట్‌లో సచిన్, చెస్‌లో విశ్వనాధన్ ఆనంద్ ఈ అవార్డుకు అర్హులు. రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా ఇచ్చే ఈ పురస్కారాన్ని ఈ ముగ్గురిలో ఎవరికిచ్చినా ఆ అవార్డుకు గౌరవం పెరుగుతుంది.

ఎస్.వెంకటరమణయ్య నెల్లూరు

### ఆలోచించమనవి!

ఆర్టీసి బస్సులలో మహిళలకు, వయోధికులకు, వికలాంగులకు కొన్ని సీట్లు రిజర్వు చేస్తున్నారు. ఈ సౌకర్యం ఆయా వర్గాలకు ఎంతో మేలు చేస్తుంది. నేను బస్సుల్లో ప్రయాణిస్తున్నప్పుడు గమనించిన విషయమేమిటంటే సాధారణంగా సీటు దొరకని పసి పిల్లల తల్లులు తమ పిల్లలను ఎత్తుకొని బస్సులో రద్దీ వల్ల, కుదుపుల వల్ల ఎంతో అవస్థపడుతున్నారు. పసి పిల్లల తల్లుల అవస్థ తొలగాలంటే ఆర్టీసి యాజమాన్యం స్త్రీలకు కేటాయించిన సీట్లలో మొదటి ప్రాధాన్యం చంటి పిల్లల తల్లులకే ఇవ్వాలి. మిగతా సీట్లలో స్త్రీలు కూర్చోవచ్చు. మూడు సంవత్సరాల లోపు చంటి పిల్లలను ఎత్తుకొన్న తల్లులకు ఈ సౌకర్యం కల్పిస్తే వారికెంతో సౌకర్యం కలుగుతుంది. ఈ విషయాన్ని ఆర్టీసి యాజమాన్యం పరిశీలించమనవి.

పి.అరుణకుమారి నెల్లూరు

# నెల్లూరులోనూ నాటుసారా పరవళ్లు!

సారా రక్కసి ప్రజల ప్రాణాలు బలిగొంటోంది. రాష్ట్రవ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో కల్తీ సారా త్రాగి పలువురు ప్రాణాలు కోల్పోయారు. ప్రతిరోజు ఏదో ఒక ప్రాంతంలో ఇలాంటి ఘటనలు చోటు చేసుకొంటూనే వున్నాయి. పేద ప్రజలు ఈ మహమ్మారి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నా ఎక్సైజ్ అధికారులు మాత్రం లంచాల మత్తులో మునిగితేలుతుండడంతో కల్తీసారా తయారీ అమ్మకాలు జోరుగా సాగుతున్నాయి. జిల్లాలోనూ వివిధ ప్రాంతాలలో సారా అమ్మకాలు గుట్టుచప్పుడు కాకుండా జరుగుతున్నాయి. ఏదైనా ఘటన జరిగినప్పుడో, మరేదైనా ఘోరం సంభవించినప్పుడో నిద్రమేల్కొని తూతూ మంత్రంగా దాడులు చేసి సారా తయారీ ప్రాంతాలకు వెళ్లి సారా ఊటను, సామగ్రిని ధ్వంసం చేసి ఫోటోలకు ఫోజు ఇవ్వడం తప్ప వీటిని అరికట్టే విషయంలో సంబంధిత శాఖాధికారులు సక్రమంగా చర్యలు చేపట్టిన దాఖలాలు లేవన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

జిల్లాలో కావలి, గూడూరు, ఆత్మకూరు డివిజన్లలోని వివిధ ప్రాంతాలలో సారా తయారీ కేంద్రాలు విచ్చలవిడిగా వున్నాయి. పల్లెల్లో, అటవీప్రాంతాలలో సారా తయారు చేసి విక్రయాలు జరుపుతున్నా పట్టించుకొనేవారే లేకుండాపోయారు. బోగోలు, దగదర్తి, దుత్తలూరు, మర్రిపాడులోని పలు ప్రాంతాలలో సారా తయారు చేస్తున్నారు. చాలా ఏళ్లుగా ఈ వ్యవహారం జరుగుతున్నా ఎక్సైజ్ అధికారులు పట్టించుకోవడం లేదు. బోగోలు మండలంలో ఇళ్ల మధ్య సారా తయారీ జరుగుతుండడంపై ప్రజలు సమాచారం అందించినా స్పందించిన దాఖలాలు తక్కువ. వెంకటగిరి కొండక్రింద పల్లెల్లో ఈ సారా తయారీ అధికంగా వుంటోంది. డక్కిలి, రాపూరు, బాలాయపల్లి తదితర ప్రాంతాలలో సారా తయారు చేసి అమ్మకాలు సాగిస్తున్నారు. దగదర్తి మండలం కామినేనిపాడు, దామవరం, నాగులవరం ప్రాంతాలలో కల్లుకుండల్లో సారా నింపి కల్లు అమ్ముతున్నట్లు అమ్మకాలు సాగిస్తున్నారట. సూళ్లూరుపేట మండలంలోని పలు గ్రామాల్లో సారా తయారీ కుటీర పరిశ్రమగా మారింది. ముఖ్యంగా కొణ్ణంబట్టు గ్రామంలో అధికంగా వుంటోంది. చిత్తూరు జిల్లా సరిహద్దు గ్రామాలకు, వివిధ ప్రాంతాలకు తరలిపోతున్నట్లు సమాచారం. ఇంతగా సారా తయారీతో పాటు, అమ్మకాలు జరుగుతున్నా ఎక్సైజ్ అధికారులు కఠిన చర్యలు చేపట్టడంలో ఘోరంగా విఫలమవుతుండడానికి కారణం సారా అమ్మకపుదారుల నుంచి నెలనెలా ముడుపులు అందడమేనన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో జరుగుతున్న ఘటనలు, ప్రాణాలు కోల్పోతున్న పేదలను దృష్టిలో వుంచుకొనైనా జిల్లాలో అలాంటివి జరగకుండా వుండేలా నాటుసారా తయారీ కేంద్రాలపై నిఘా వుంచి వాటిని స్వాధీనం చేయాలని జిల్లా వాసులు కోరుకొంటున్నారు. లేదంటే చేతులు కాలాక ఆకులు పట్టుకొన్న చందం అవుతుంది.

> జిల్లాలోని కావలి, గూడూరు, ఆత్మకూరు డివిజన్ల పరిధిలోని పలు గ్రామాల్లో నాటుసారా కాస్తున్నారు. ఈ విషయం ఎక్సైజ్ శాఖాధికారులకు తెలిసినా మామూళ్లు తీసుకొని చూసీచూడనట్లున్నారు.

# జనన, మరణ ధృవీకరణ పత్రాల కోసం పడరాని పాట్లు!



నెల్లూరు తహశీల్దార్ కార్యాలయంలో పని జరగదేమి?

> నెల్లూరు తహశీల్దార్ కార్యాలయంలోని సహాయ గణాంకాధికారి వద్ద గత ఏడెనిమిది నెలలుగా వందలాది దరఖాస్తులు పెండింగ్‌లో ఉన్నాయి. ఈ పత్రాలు తప్పనిసరి కావడంతో వీటి కోసం దరఖాస్తు చేసే వారి బాధ వర్ణనాతీతంగా ఉంది.

జనన, మరణ ధృవీకరణ పత్రాలు పొందేందుకు ప్రజలు తీవ్ర ఇక్కట్లు పడుతున్నారు. నిన్న, మొన్నటి వరకు మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు ఈ పత్రాలు జారీ చేసేందుకు త్రిప్పుకొనే వారు. ప్రస్తుతం అక్కడ కొంతమేర సమస్యను పరిష్కరించి నిర్ణీత సమయంలోగా పత్రాలు జారీ చేసేందుకు అధికారులు చర్యలు చేపట్టారు. అయితే నివాసాల వద్ద జన్మించి సకాలంలో పేర్లు నమోదు చేసుకోని వారికి తహశీల్దార్ కార్యాలయం ద్వారా ఆర్డీఓ కార్యాలయం నుంచి జనన, మరణ ధృవీకరణ పత్రాలు జారీ చేస్తారు. ఇందుకు అవసరమైన అన్ని పత్రాలు అందజేసినా నెలల తరబడి తహశీల్దార్ కార్యాలయ ఉద్యోగులు కాలయాపన చేస్తున్నారు.



ప్రతి తహశీల్దార్ కార్యాలయంలో సహాయ గణాంకాధికారి ఈ బాధ్యతలు నిర్వర్తించాల్సి వుంటుంది. జనన, మరణ ధృవీకరణ పత్రాల కోసం వందల సంఖ్యలో దరఖాస్తులు అందుతున్నా వీటిని పరిశీలించి ఆర్డీఓ కార్యాలయానికి పంపడంలో సంబంధిత గణాంకాధికారులు చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. విఆర్వో, ఆర్ఐల నుంచి వ్రాత పూర్వకంగా సిఫార్సు అందినా కూడా ఏదో ఒక కారణం చూపి దరఖాస్తులను పెండింగ్‌లో పెడుతున్నారు. గణాంకాధికారులు వ్యవహరిస్తున్న తీరును తహశీల్దార్ దృష్టికి తీసుకెళ్లినా కూడా సమస్య పరిష్కారం కావడం లేదు.

దీంతో పాఠశాలల్లో తమ పిల్లలను చేర్పించలేక పోతున్నామని తల్లిదండ్రులు, వివిధ ప్రభుత్వ కార్యాలయాల్లో మరణ ధృవీకరణ పత్రాలు సమర్పించి ఉపాధి పొందాల్సినవారు ఇబ్బందులు పడుతున్నామని వాపోతున్నారు. గణాంకాధికారుల తీరుపై ఎవరైనా బాధితులు ప్రశ్నిస్తే దురుసుగా సమాధానం చెప్పడమే కాకుండా వారి దరఖాస్తులను తిరస్కరిస్తుంటారు. మరికొందరు అధికారులు క్యాంపుల పేరుతో నెలల తరబడి దరఖాస్తులను పరిశీలించట్లేదు. జనన, మరణ ధృవీకరణ పత్రాలు సకాలంలో అందకపోవడంపై ఉన్నతాధికారులు సైతం సమీక్ష చేయడం లేదు. దీంతో ఈ అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ పోతున్నారు.

నెల్లూరు తమశీల్దార్ కార్యాలయంలో నైతే గత ఎనిమిది నెలల నుంచి వందలాది దరఖాస్తులు మూలపడి వున్నాయి. ఈ విభాగంలో విధులు నిర్వహించే గణాంకాధికారి నిత్యం క్యాంపుల్లో వుంటాడు. కార్యాలయానికి, ఎప్పుడు వస్తాడో ఎప్పుడు రాడో ఆ కార్యాలయ సిబ్బందికి కూడా తెలియని పరిస్థితి. వీరికి గ్రామాల్లో పర్యటించాల్సిన అవసరం ఏమేరకు వుంటుందో కూడా చెప్పే దిక్కు లేకుండా పోయారు. గ్రామీణ ప్రాంతాల్లో గణాంక వివరాలు సేకరించాల్సి వుంటుంది. వీరు ఏ గ్రామానికి కూడా సర్వే చేపట్టేందుకు వెళ్లిన సందర్భాలు కనిపించడం లేదు. ఎవరో ఒకరిని నియమించి సర్వే చేయిస్తుంది ప్రభుత్వం.

అయితే కార్యాలయంలో మాత్రం క్యాంపు పేరు చెప్పి సొంత వ్యవహారాలు చక్కబెట్టుకుంటున్నారన్న విమర్శలు ఉన్నాయి. ఇప్పటికైనా ఉన్నతాధికారులు స్పందించి గణాంకాధికారుల పనితీరును పర్యవేక్షించడంతోపాటు, సకాలంలో జనన, మరణ ధృవీకరణ పత్రాలు ప్రజలకు అందించేందుకు అవసరమైన చర్యలు తీసుకోవాలి.

**చందాదారులకు మనవి**

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

# కెవిపికి సిబిఐ శ్రీముఖం



కెవిపి రామచంద్రరావుకు సిబిఐ శ్రీముఖం జారీ అయ్యిందని విశ్వసనీయంగా తెలుస్తున్నది. కెవిపి అంటే వైఎస్.రాజశేఖర్ రెడ్డి ఆత్మ. ఒకే మంచం ఒకే కంచంగా జీవితం గడిపిన స్నేహబంధం వుంది వారిద్దరి మధ్య. దానికి తగినట్లుగానే వైఎస్ హయాంలో జరిగిందని భావిస్తున్న దాదాపు లక్ష కోట్ల రూపాయల ప్రజాధనం దోపిడీకి సూత్రధారిగా వ్యవహరించాడు కెవిపి. ఆయనకు తెలియకుండా ఆ ఆరేడేళ్ల కాలంలో సర్కారులో ఫైల్ కదలలేదు. ఒక్క అధికారి మెదలలేదు. వైఎస్ తాను చేసే ప్రతి పనీ కెవిపికి చెప్పే చేసేవాడన్నది బహిరంగ రహస్యం. అందుకోసం ముట్టిన ప్రతి పైసా లెక్క ఆయన వద్ద వుంది. అయితే జగన్ అక్రమాస్తులు, ఎమ్మార్, గాలి గనుల కేసుల్లో కెవిపి వూసే లేదు. కెవిపి ప్రమేయం లేకుండా ఏదీ జరగలేదని తెలిసీ, ఆయన్ను విచారించకుండా సిబిఐ చేసే దర్యాప్తుకు విలువ ఏమి వుంటుందని అందరూ ప్రశ్నిస్తున్నారు. కానీ ఏ కారణం వల్లనో ఇంతకాలం సిబిఐ అధికారులు ఆయన జోలికి వెళ్లలేదు. కానీ ఎమ్మార్ కేసులో స్టైలిష్ రంగారావు, గాలి కేసులో ఐఎఎస్ అధికారిణి శ్రీలక్ష్మి తమ వాంగ్మూలాలలో కెవిపి పాత్ర గురించి ప్రస్తావించారట. దానితో సిబిఐకి ఆయన్ను పిలవక తప్పని పరిస్థితి ఏర్పడింది. అయితే ఆయన్ను ముద్దాయిగా కాక, కేవలం సాక్షిగా మాత్రమే విచారించాలని నిర్ణయించుకొన్నట్లు చెప్తున్నారు. సంక్రాంతి తర్వాత ఆయన సిబిఐ ముందు హాజరౌతారని అంచనా.

కెవిపి నోరు విప్పితే, వైఎస్ జమానా పాపాల పుట్ట పగిలిపోతుంది. కానీ ఆయన నోరు విప్పించే సామర్థ్యం సిబిఐకి వుంటుందని భావించలేము. మామూలుగానే కెవిపి మితభాషి. మాట్లాడితే నోటి ముత్యాలు రాలి పోతాయేమో అన్నట్లు గంభీరంగా వుంటాడు. అటువంటిది, దర్యాప్తు సంస్థలు అడిగే ప్రశ్నలకు ఆయన అంత సులభంగా సమాధానాలు చెప్తాడా?







Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com